భూరేఖకు, ప్రాక్పశ్చిమ దేశాంతర స్థితయోజనములం దెలిపెడి చక్రము.

| దేశసంఖ్య | వర్ణక్రమ దేశ నామములు. | రేఖకు దేశ ముండుట | దూరయోజనములు. | దేశసంఖ్య | వర్ణక్రమ దేశ నామములు. | రేఖకు దేశ ముండుట | దూరయోజనములు. |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఆర్కాడు ... | తూర్పు | ౨౬ | ౧౮ | తిరువనందపురము | తూర్పు | ౮ |
| ౨ | ఉదకమండలము | ... | ౭ | ౧౯ | ధార్వాడ-ఇది రేఖోపరిస్థితం } | — | |
| ౩ | కడప ... | — | ౧౩ | ౨౦ | నాగపూరు | — | ౨౫ |
| ౪ | కన్ననూరు | పశ్చిమ | ౪ | ౨౧ | నెల్లూరు | — | ౩౧ |
| ౫ | కర్నూలు | తూర్పు | ౧౭ | ౨౨ | ప్రయాగ | — | ౪౫ |
| ౬ | కాంచీపురము | — | ౨౯ | ౨౩ | బల్లారి | — | ౮ |
| ౭ | కాకినాడ | — | ౪౯ | ౨౪ | బెంగుళూరు | — | ౧౪ |
| ౮ | కాశి | — | ౫౪ | ౨౫ | మంగుళూరు | పశ్చిమ | ౮ |
| ౯ | కోయంబుత్తూరు | — | ౮ | ౨౬ | మచిలీపట్టణము | తూర్పు | ౪౦ |
| ౧౦ | గుంటూరు | — | ౩౪ | ౨౭ | మధుర | — | ౪౯ |
| ౧౧ | గుత్తి | — | ౧౪ | ౨౮ | మైసూరు | — | ౭ |
| ౧౨ | గూడలూరు | — | ౨౯ | ౨౯ | రాజమహేంద్రము | — | ౪౪ |
| ౧౩ | గంజాం | — | ౭౦ | ౩౦ | విజయనగరము | — | ౫౭ |
| ౧౪ | చెన్నపురి | — | ౨౫ | ౩౧ | విశాఖపట్టణము | — | ౫౬ |
| ౧౫ | చిత్తూరు | — | ౩౩ | ౩౨ | శ్రీకాకుళము | — | ౬౧ |
| ౧౬ | తంజావూరు | — | ౨౫ | ౩౩ | సేలము | — | ౧౭ |
| ౧౭ | తిరునల్వేలి | — | ౨౧ | ౩౪ | హైదరాబాదు | — | ౨౧ |



ఇందుకు ఉదహరణము.

లిప్తలు - విలిప్తలు.

రవి మధ్యగతి ౫౯ — ౮
యోజనాలు ౩౯
౫౩౧-౩౧౨
౧౭౭
౨౩౦౧-౩౧౨
౫ -౩౦౦
౪౮౦౦] ౨౩౦౬-౧౨[౦-లి
౬౦
౧౩౮౩౬౦
౧౨
౪౮౦౦] ౧౩౮౩౭౨[౨౮-లి
౯౬౦౦
౪౨౩౭౨
౩౮౪౦౦
౩౮౭౨

ఇవియే దేశాంతర లిప్తా విలిప్తలు ఈ ప్రకారము అన్ని గ్రహములకును వారి వారి గతులచేత లిప్తా విలిప్తలను సాధించవలెను.

ఒక దేశమునకు నిరూపించెదను.

దేశాంతర లిప్తలు విలిప్తలు

| | | |
|---|---|---|
| రవికి | ... | ౦ — ౨౮ |
| చంద్రునకు | ... | ౬ — ౨౫ |
| కుజునకు | ... | ౦ — ౧౫ |
| బుధునకు | ... | ౧ — ౫౯ |
| గురునకు | ... | ౦ — ౨ |
| శుక్రునకు | ... | ౦ — ౪౭ |
| శనికి | ... | ౦ — ౧ |
| చంద్రోచ్చమునకు | ... | ౦ — ౩ |
| రాహువునకు | ... | ౧ — ౩ |

ఈ దేశాంతర లిప్తా విలిప్తలను తివిచిన పూర్వోక్త గ్రహములు.

| | రా—భా — లి —విలి |
|---|---|
| రవి | ౧—౨౩— ౩—౪౧ |
| చంద్రుడు | ౨—౨౯—౫౪—౨౯ |
| చంద్రోచ్చము | ౫—౧౪—౩౧— ౯ |
| కుజుడు | ౭— ౧—౧౩—౪౭ |

ఇట్లుచేయ స్వదేశీయ మధ్యగ్రహ మధ్యగ్రహంబులగును.

అవ॥ ఇపుడు గ్రహములకు ర గవదియగు దృక్ఫల సంస్కారార్థమై గుణ్యరాశిం దెచ్చు క్రమమును జెప్పుచున్నాడు.

శ్లో॥ కల్యాద్యబ్దాఃఖఖరస గుణైర్భాజితా స్తత్ర శేషం।
జ్ఞాత్వాశూన్యాంబరగజ భువోల్పం యది స్యాత్తదేవ।
గుణ్యంతస్మాదధికమిహ చేత్షష్టికృత్తోనితంత।
చ్ఛేషంగుణ్యంఖచరగుణకై ర్హారకై ర్హార్యమేవం॥

టీ॥ కల్యాద్యబ్దాః = కల్యాదిగతాబ్దములు, ఖఖరసగుణైః = [ఖ-౦, ఖ-౦, రస - ౬, గుణైః - ౩,]-౩౬౦౦ చేత, భాజితాః = భాగింపబడుచుండ, తత్ర=అందు, శేషంజ్ఞాత్వా = శేషము నెఱిగి, ఆశేషము, శూన్యాంబరగజభువ్యః = [శూన్య-౦, అంబర-౦, గజ-౮, భువః-౧,]-౧౮౦౦ దీనికంటె, అల్పంయది = తక్కువైనయెడల, తదేవ = అదియే, గుణ్యంస్యాత్ = గుణింపఁదగినదియగును. తస్మాత్ = ఆ, ౧౮౦౦ కంటె, ఇహ = ఇక్కడ, అధికంచేత్ = ఎక్కువైనయెడల ఆశేషము, షష్టికృత్యోః నితం = షష్టి - ౬౦ యొక్క, కృతి = వర్గమైన, ౩౬౦౦ వల్ల, ఊనితం = తీవచబడుచుండగా, తచ్ఛేషం=ఆశేషమును, ఏవం = ఈదిగువ చెప్పబోయ్యెడి ప్రకారము, ఖచరగుణకైః = ఆ యా గ్రహగుణక సంఖ్యలచేత, గుణ్యం = గుణింపదగినదియై, హారకైః = ఆ యా గ్రహభాగహార సంఖ్యలచే, హార్యం = భాగింపదగినది యగును.

అవ॥ ఇపుడు గ్రహములకు దృక్సంస్కార గుణకార భాగహారసంఖ్యలను మూడు శ్లోకములచే జెప్పంబడును.

శ్లో॥ చన్ద్రోచ్చస్యశివాఃగురోర్ది నకరాశ్శుక్రస్యనేత్రాబ్ధయ ।
శ్శీతాంశోస్తుభవాఃభవంతిగుణకాఃప్రోక్తాశ్చతేషాంక్రమాత్।
పంచార్కాఃపవనాశ్విశీత రుచయస్తత్త్వేందవోహారకాః ।
వ్యోమాకాశశరాస్సమాగత ఫలం లిప్తాదికంశోధయేత్ ॥

టీ॥ చంద్రోచ్చస్య = చంద్రోచ్చమునకు, శివాః - ౧౧ ను, గురోః = గురునకు, దినకరాః - ౧౨ ను, శుక్రస్య = శుక్రునకు, నేత్రాబ్ధయః = [నేత్ర - ౨, అబ్ధయః - ౪,] - ౪౨ ను, శీతాంశోస్తు = చంద్రునకు, భవాః - ౧౧ ను, ప్రోక్తాః- ఈ చెప్పబడినవి, గుణకాః - గుణకములు, భవంతి = అగుచున్నవి. తేషాం = ఆచంద్రోచ్చాదులకు, క్రమాత్ = క్రమముగాను, పంచార్కాః=[పంచ - ౫, అర్కాః= ౧౨,] ౧౨౫ ను, పవనాశ్విశీతరుచయః = [పవన - ౫, అశ్వి - ౨, శీతరుచయః-౧,] ౧౨౫ ను, తత్త్వేందవః = [తత్త్వ - ౨౫, ఇందవః - ౧,] ౧౨౫ ను; వ్యోమాకాశశరాః = [వ్యోమ - ౦; ఆకాశ - ౦; శరాః - ౫;] ౫౦౦ ను; హారకాః - భాగహారములగును. సమాగతఫలం - వచ్చిన లబ్ధమగు; లిప్తాదికం - లిప్తావిలిప్తలను; శోధయేత్ - ఆ యా గ్రహములలో శోధించవలయును అనగా తీసివేయవలెననుట.



శ్లో॥ భూనందనస్య మనవో రవియుక్శనేశ్చ దృక్సామ్యసిద్ధికరణే గుణక భవేతాం । తత్త్వేందవశ్శరకరా వనయస్తుహారా లబ్ధాకలాదికఫలం త్వనయోః ప్రయోజ్యమ్।

టీ॥ భూనందస్య-కుజునకు; మనవః = ౧౪, శనేః - శనికి; రవియుక్ - అందు ౧౨ కూడినది. అనగా ౨౬ ను; గుణకా - గుణకములు; దృక్సామ్యసిద్ధికరణే - దృక్సమసిద్ధింజేయుటయందు, భవేతాం - అగుచున్నవి. ఆ కుజ శనులకు క్రమంబుగ, తత్త్వేందవః - [తత్త్వ - ౨౫, ఇదంవః - ౧,] - ౧౨౫ ను, శరకరావనయస్తు - [శర - ౫, కర - ౨, అవనయస్తు - ౧,] - ౧౨౫ ను, హారా - భాగహారములగును. లబ్ధం - పొందబడిన, కలాదికఫలం-లబ్ధలిప్తావిలిప్తలను, అనయోః-ఈ కుజ శనులలో, ప్రయోజ్యం-కూడదగినది. అనగా ధనం చేయవలెననుట,

శ్లో॥ నక్షత్రసంఖ్యాగుణితం శూన్యతత్త్వవిభాజితం ।
లబ్ధంలిప్తాదికంశోధ్యం రాహోర్బీజఫలంబుధైః ॥

టీ॥ రాహోః - రాహువునకు, నక్షత్రసంఖ్యా గుణితం - నక్షత్రసంఖ్యా - ౨౭ చేతను, గుణితం - గుణింపబడుచు, శూన్యతత్త్వ విభాజితం - [శూన్య - ౦, తత్త్వ - ౨౫,] - ౨౫౦ దీనిచేత, విభాజితం - భాగింపబడుచుండ, లబ్ధం - లబ్ధమైన, లిప్తాదికం - లిప్తావిలిప్తల రూపమగు, బీజఫలం - దృక్సంస్కారఫలమును, బుధైః- సిద్ధాంతులచేత, శోధ్యం - తీవదగినది. [తీసివేయవలెను.]

తా॥ కల్యబ్దములను ౩౬౦౦ చేత భాగించగా ఆశేషము ౧౮౦౦ కంటె తక్కువైనయెడల, అది గుణ్యరాశి యగును. ఆశేషము ౧౮౦౦ కంటె యెక్కువైనయెడల, దానిని ౩౬౦౦ లో తీవచగా మిగిలినది గుణ్యరాశియగును. ఇట్లు గుణ్యరాశిని యేర్పర్చుకొని ఈక్రింద చెప్పఁబడిన ఆ యా గ్రహ గుణ కారములచే గుణించి, ఆ యా గ్రహభాగహార సంఖ్యలచే భాగించగా, లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చేత గుణించి మఱల భాగించగా లబ్ధము విలిప్తలగును. ఇట్లు పొందబడిన లిప్తావిలిప్తలను, చంద్ర, గురు, శుక్ర, చంద్రోచ్చ, రాహువులలో [తీవచవలెను.] అనఁగా ఋణం చేయవలెను. కుజ శనులలో ధనం చేయవలెను. అనఁగా కలపవలెననుట.

## గ్రహముల దృక్సంస్కార గుణక భాగ హార సంఖ్యలు.

| | గణకములు. | భాగహారములు. |
|---|---|---|
| రవికి | ౦ | ౦ |
| చంద్రునకు | ౧౧ | ౫౦౦ |
| కుజునకు | ౧౪ | ౧౨౫ |
| బుధునకు | ౦ | ౦ |
| గురునకు | ౧౨ | ౧౨౫ |
| శుక్రునకు | ౪౨ | ౧౨౫ |
| శనికి | ౨౬ | ౧౨౫ |
| చంద్రోచ్చకు | ౧౧ | ౧౨౫ |
| రాహువునకు | ౨౭ | ౨౫౦ |

| | |
|---|---|
| కుజుడు | ౭-౧-౧౩-౪౭ |
| దృక్ఫలం | ౨-౩౧-౫౯ |
| కుజుడు | ౭-౩-౪౫-౪౬ |

### కుజునకు ఉదహారణము.

కల్యబ్దములు ౪౯౫౭ దీనిని ౩౬౦౦ చే భాగించగా, శేషము ౧౩౫౭ ఇది పూర్వోక్త ప్రకారము ౧౮౦౦ కంటె తక్కువైనందున యిదియే గుణ్యరాశియగును. గనుక, ౧౩౫౭ ను ౧౪ చేత గుణించగా—౧౮౯౯౮ వచ్చును. దీనిని ౧౨౫ చే భాగించగా లబ్ధము లిప్తలు ౧౫౧ ఆ శేషము ౧౨౩ దీనిని ౬౦చే గుణించి మరల ౧౨౫ చే భాగించగా విలిప్తలు ౫౯ వచ్చినవి. లిప్తలు ౬౦ కంటె అధికమైనందున ౬౦ చే భాగించి, భాగలుచేసికొనగా కుజునకు దృక్సంస్కార భాగలు ౨ లిప్తలు ౩౧ విలిప్తలు పరలు ౫౯ అయినవి.

కొందరు పంచాంగ కర్తలు చంద్రునకు దృక్సంస్కారమును చేయుటము లేదు. గనుక ప్రస్తుతము విడిచితిని రాహువునకు చేయుచున్నారు. గనుక చేయవలెను.

అవ॥ ఇపుడు గ్రహములకు గి దవది యగు (భుజాఫల సంస్కారమును) జెప్పంబడును.

శ్లో॥ సూర్యబాహుఫలఘ్నాన్నా ఖేచరణాంగతిఃపృథక్ ।
చక్రలిప్తహృతాల్లబ్ధం ఫలంకుర్యాద్రవేరివ ॥

టీ॥ ఖేచరాణాం - గ్రహములయొక్క, గతిః - గతి, సూర్యబాహుఫలఘ్నా - సూర్యబాహుఫల - సూర్యునియొక్క భుజములచేత, ఘ్నా - గుణింపబడినదై - పృథక్ - ప్రత్యేకముగా, చక్రలిప్తహృతాత్ - చక్రలిప్త ౨౧౬౦౦ చేత, హృతాత్ - భాగించుటవల్ల, లబ్ధంఫలం - పొందబడిన లిప్తాదిఫలమును, రవేరివ - సూర్యునకువలె, కుర్యాత్ - సంస్కరించవలెను.



తా॥ క్రింద జెప్పబోయ్యేడి ఆయా గ్రహ మధ్య గతిని సూర్యుని భుజ ఫలము చేత గుణించి ౨౧౬౦౦ చేత భాగించగా వచ్చిన లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చే గుణించి, మరల భాగించిన లబ్ధము విలిప్తలగును. యీ ప్రకారము ఆయా గ్రహ లిప్తావిలిప్తలను స్ఫుటకర్మయందు సూర్యునకు సంస్కరించిన ప్రకారము ధన ఋణము లెఱిగి ఆ యా గ్రహములలో సంస్కరించవలసినది.

భుజ ఫల సంస్కారమునకు లఘూపాయము రెండు శ్లోకములచే జెప్పంబడును.

శ్లో॥ పంచర్తురామైర్మునిలోచనైశ్చ శైలాష్టతర్కైశ్చగజాష్టభిశ్చ।
దంతాగ్నివేదైఃకృతనేత్రబాహుభిఃరసర్తుశైలాభ్రకుభిఃక్రమేణ॥

టీ॥ క్రమేణ - రవ్యాది గ్రహ క్రమంబున, పంచర్తురామైః - (పంచ - ౫, ఋతు - ౬, రామైః - ౩, ) - ౩౬౫ చేతను, మునిలోచనైశ్చ - (ముని - ౭, లోచనైశ్చ - ౨) - ౨౭ చేతను, శైలాష్టతర్కైశ్చ - (శైల - ౭, అష్ట - ౮, తర్కైశ్చ - ౬) - ౬౮౭ చేతను, గజాష్టభిశ్చ - (గజ - ౮, అష్టభిశ్చ - ౮,) - ౮౮ చేతను దంతాగ్నివేదైః - (దంత - ౩౨, అగ్ని - ౩, వేదైః - ౪,) - ౪౩౩౨ చేతను, కృతనేత్రబాహుభిః - (కృత - ౪, నేత్ర - ౨, బాహుభిః - ౨) - ౨౨౪ చేతను, రసర్తుశైలాభ్రకుభిః - (రస - ౬, ఋతు - ౬, శైల - ౭, అభ్ర - ౦; కుభిః - ౧, ) - ౧౦౭౬౬ చెతను.

శ్లో॥ సూర్యబాహుఫలంసర్వ గ్రహాణాంహారకైఃపృథక్ ।
విభజ్యలబ్ధంలిప్తాది కుర్యాత్సూర్యస్ఫుటోక్తవత్ ॥

టీ॥ సర్వగ్రహాణాం - రవ్యాది గ్రహంబులయొక్క, హారకైః - భాగహార సంఖ్యలచెత, పృథక్ - ప్రత్యేకముగ, సూర్యబాహుఫలం - రవి భుజ ఫలమును, విభజ్య - భాగించి, లబ్ధం - పొందబడు, లిప్తాది - లిప్తావిలిప్తలను సూర్యస్ఫుటోక్తవత్ - సూర్య స్ఫుట కర్మయందు చెప్పినట్లు, ( అనగా సూర్యునకువలెననుట ) కుర్యాత్ - సంస్కరించవలెను.

## భుజ ఫల భాగ హార సంఖ్యలు.

| | |
|---|---|
| రవికి | 3౬౫ |
| చంద్రునకు | ౨౭ |
| కుజునకు | ౬౮౭ |
| బుధునకు | ౮౮ |
| గురునకు | ౪33౨ |
| శుక్రునకు | ౨౨౪ |
| శనికి | ౧౦౭౬౬ |

ఇపుడే, సూర్యస్ఫుటాధ్యాయమందు జెప్పిన చొప్పున సూర్యుని స్ఫుటముజేసి, రవి భుజాఫలము నెరింగి, సూర్య భుజ ఫలమును ఆయా గ్రహ భాగ హార సంఖ్యలచె భాగించగా వచ్చిన లబ్ధము లిప్తలగును ఆశేషమును ౬౦ చె గుణించి మరల భాగించగా లబ్ధము విలిప్తలగును. ఇట్లు సాధించిన లబ్ధ లిప్తావిలిప్తలను సూర్యునియందు వలెనే ఆయా గ్రహములలో సంస్కరించవలెను.

## ఉదహరణము.

రవిని ఇపుడే స్ఫుటముచేయగా రవి ధన భుజ ఫలము — లిప్తలు - ౫౪ - విలిప్తలు - ౧౯ - దీనిని ఆయా గ్రహ భాగ హార సంఖ్యలచే భాగించగా రవికి లిప్తలు - ౦ - విలిప్తలు - ౮ చంద్రునకు లిప్తలు - ౨ - విలిప్తలు - ౦ - కుజునకు లిప్తలు - ౦ - విలిప్తలు - ౪ - వీనిని రవి భుజా ఫలము ధనమగుటచేత పూర్వోక్త గ్రహములలో చేర్చగా రవి భుజా ఫల భాగ సంస్కార మధ్య గ్రహము లగును.

| | రా - భా - లి - విలి | | |
|---|---|---|---|
| (౧) రవికి | ౧ - ౨3 - 3 - ౪౯ | (౨) చంద్రుడు | ౨ - ౨౯ - ౫౬ - ౨౯ |
| | | (3) కుజుడు | ౭ - 3 - ౪౫ - ౫౦ |

ఇపుడు, రవ్యాది గ్రహ మధ్య గత్యుత్పత్తి క్రమమును జెప్పఁబడును.

శ్లో॥ ద్యుగణస్యోక్తగుణకాః భాగహారైర్విభాజితాః ।
గ్రహాణాంమధ్యగతయో భవంతిభముఖాదయః ॥

టీ॥ ద్యుగణస్య - అహర్గణమునకు, ఉక్తగుణకాః - ఆయా గ్రహములకు చెప్పబడిన గుణకములు, భాగహారైః - ఆయా గ్రహ భాగ హారములచేత, విభాజితాః - భాగింపబడుచుండ, గ్రహాణాం - రవ్యాదులయొక్క, భముఖాదయః - భగణరాశ్యాదికములగు, మధ్యగతయః - మధ్యగతులు, భవంతి - అగుచున్నవి.



తా॥ ద్యుగణమునకు జెప్పఁబడిన ఆయా గ్రహ గుణకారములను ఆయా ద్యుగణ గ్రహభాగహార సంఖ్యలచె భాగించగా లబ్ధము భగణములగును. ఆశేషమును ౧౨ చే గుణించి మరల భాగించగా రాసులగును. ఆ శేషమును 3౦ చేత గుణించి మరల భాగించగా లబ్ధము భాగలగును. ఆ శేషమును ౬౦ చేత గుణించి మరల భాగించగా లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చేత గుణించి మరల భాగించగా లబ్ధము విలిప్తలగును. ఆ శేషమును మరల ౬౦ చేత గుణించి మరల భాగించగా లబ్ధము పరలగును. ఆ శేషమును మరల ౬౦ చేత గుణించి మరల భాగించగా లబ్ధము విపరలగుననుట.

ఇట్లు భాగించగా యేర్పడిన గ్రహ మధ్య గతులను లిప్తా విలిప్తల రూపముగా మూడు శ్లోకములచే జెప్పఁబడును.

శ్లో॥ లిప్తావిలిప్తాసూర్యస్య గతిర్నవశరాగజాః ।
చంద్రస్యశూన్యనందాశ్వాః విషయాగ్నయఏవహి ॥

టీ॥ సూర్యస్యగతిః = సూర్యునిగతి, నవశరాః = [నవ - ౯, శరాః - ౫,]— ౫౯, లిప్తా = విలిప్తలును, గజాః - ౮, విలిప్తాః = విలిప్తలును, చంద్రస్య = చంద్రునకు, శూన్యనందాశ్వాః = [శూన్య - ౦, నంద - ౯, అశ్వాః = ౭] - ౭౬౦ లిప్తలును, విషయాగ్నయః = [విషయ - ౫, అగ్నయః - 3,] - 3౫ విలిప్తలును.

శ్లో॥ అంగారకస్యచక్షోణి వహ్నయోంగాశ్వినోగతిః ।
జ్ఞస్యబాణజినాదంతాః గురోఃపంచాంబరంతతః ॥

టీ॥ అంగారకస్య = కుజునకు, గతిః = గతి, క్షోణివహ్నయః = [క్షోణి-౧, వహ్నయః - 3,] - 3౧ లిప్తలును, అంగాశ్వినశ్చ - [అంగ - ౬, అశ్వినశ్చ - ౨,] — ౨౬ విలిప్తలును, జ్ఞస్య = బుధునకు, బాణజినాః = [బాణ - ౫, జినాః ౨౪,] — ౨౪౫ లిప్తలును, దంతాః = 3౨ విలిప్తలును, తతః = అనంతరము.

శ్లో॥ శుక్రస్యాంగనవాష్టౌచ సూర్యజస్యాశ్వినోవియత్ ।
షడ్భూవేదావిధూచ్చస్య రాహోర్వహ్నియఈశ్వరాః ॥

టీ॥ శుక్రస్య = శుక్రునకు, అంగనవాః = [అంగ = ౬, నవాః = ౯,] - ౯౬ లిప్తలును, అష్టౌచ = ౮ విలిప్తలును, సూర్యజస్య = శనికి, అశ్వినః = ౨, లిప్తలును, వియత్ = ౦, విలిప్తలును, విధూచ్చస్య = చంద్రోచ్చమునకు, షట్ = ౬ లిప్తలును, భూవేదాః = [భూ - ౧, వేదాః = ౪,] = ౪౧ విలిప్తలును, రాహోః= రాహువునకు, వహ్నియః = ౩ లిప్తలును, ఈశ్వరా = ౧౧ విలిప్తలును [భవంతి] అగుచున్నవి.

తా॥ ఒక దినమునకు రవ్యాది గ్రహముల మధ్యగతులు యీక్రింద వ్రాయబడుచున్నవి. ఎట్లనిన,

| | | లిప్తలు. | విలిప్తలు. | | | లిప్తలు. | విలిప్తలు. |
|---|---|---|---|---|---|---|---|
| రవికి | ... | ౫౯ | ౮ | శుక్రునకు | ... | ౯౬ | ౮ |
| చంద్రునకు | ... | ౭౯౦ | ౩౫ | శనికి | ... | ౨ | ౦ |
| కుజునకు | ... | ౩౧ | ౨౬ | చంద్రోచ్చమునకు | | ౬ | ౪౧ |
| బుధునకు | ... | ౨౪౫ | ౩౨ | రాహువునకు | ... | ౩ | ౧౧ |
| గురునకు | ... | ౫ | ౦ | | | | |

ఇపుడు, ఇష్టకాలమునకు గ్రహమును దెచ్చెడి క్రమమును జెప్పఁబడును.

శ్లో॥ గతగమ్యేష్టనాడిఘ్నా గతిషష్టివిభాజితా ।
ఫలేనహీనయుక్తశ్చే ద్గ్రహస్తాత్కాలికోభవేత్ ॥

టీ॥ గతగమ్యేష్టనాడిఘ్నా = గతగమ్యా = గతఏష్యములైన, ఇష్టనాడి - ఇష్టకాల ఘడియలచేత, ఘ్నా = గుణింపబడిన, గతిః = గ్రహగతి, షష్టివిభాజితా = షష్టి = ౬౦ చేత, విభాజితా = భాగింపబడుచుండ, ఫలేన=ఆలబ్ధముచేత, గ్రహః = గ్రహము, హీనశ్చేత్ = తగ్గించబడియైనను, యుక్తశ్చేత్ = కూడబడియైనను, తాత్కాలికః = ఇష్టకాలగ్రహము, [భవేత్] అగును.



తా॥ మధ్యాహ్నముకంటె పూర్వము జాతకాది ఇష్టకాలమైన యెడల, సూర్యోదయాది ఆ యిష్టకాల గడియలను దినార్ధములో తివచగా గత కాల గడియలగును. మధ్యాహ్నముకంటె పైన, యిష్టకాలమైన యెడల, సూర్యోదయాది యిష్టకాల గడియలలో దినార్ధను తివచగా ఏష్యకాల గడియలగును. ఇట్లు యేర్పడిన యిష్టకాలముయొక్క గత ఏష్య గడియలను (ఇష్టగ్రహముయొక్క) అనఁగా, మధ్య గ్రహ విషయమై మధ్య గతిచేతను, స్ఫుట గ్రహ విషయమై స్ఫుటగతిచేత గుణించి, ౬౦ చేత భాగించగా, లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చేత గుణించి మరల ౬౦ చే భాగించగా లబ్ధము విలిప్తలగును. ఈ లబ్ధలిప్తావిలిప్తలను, గ్రహము గతముగా రావలసినయెడల గ్రహములో తివచవలెను. ఏష్యముగా రావలసినయెడల గ్రహములో కలపవలెను. గ్రహమునకు వక్రగతియైనయెడల, ఏష్యమైతే ఆలిప్తావిలిప్తలను గ్రహములో తివచవలెననియు, గతమైతే కలపవలెననియు అభిప్రాయము.

ఇందుకు మధ్య గ్రహ విషయమై, ఉదాహరణము మధ్యాహ్న సూర్యుని రాత్రి కాలమునకు తాత్కాలించునపుడు, మధ్యాహ్నము మొదలు, నిశీధిపర్యంతము ౩౦ ఘడియలగును. దీనిచేత రవి మధ్య గతియైన (౫౯ = లిప్తలు ౮ = విలిప్తలను) గుణించి ౬౦ చే భాగించగా, లబ్ధలిప్తావిలిప్తలు ౨౯ - ౩౪ వచ్చుచున్నవి. వీనిని మధ్యాహ్న మధ్య గ్రహములో కలపగా నిశీధి కాలసూర్యుండగును. ఈ ప్రకారమే గతకాలమునకు లిప్తావిలిప్తలను సాధించి గ్రహములో తివచగా తాత్కాలిక గ్రహమగును.

ఇపుడు, ద్యుగణ సంఖ్యలయొక్క సంకలనజన్యమగు మధ్య గ్రహానయమును జెప్పఁబడును.

శ్లో॥ ఏకాదిస్థానసంఖ్యానాం పదకానామహర్గణే ।
సంయోగాన్మధ్యఖేటస్స్యాత్ పూర్వధృవసమన్వితః ॥

టీ॥ అహర్గణే = ద్యుగణమందు, ఏకాదిస్థానసంఖ్యానాం = ఏకాదిస్థానములయందుండు సంఖ్యఁగల, పదకానాం = పదకములయొక్క, సంయోగాత్ = కూడికవల్ల మధ్యఖేటః = మధ్యగ్రహము, పూర్వధృవసమన్వితః = పూర్వధృవముతో జేరినదగుచు, స్యాత్ = అగును.

తా॥ అహర్గణమందు ఏకాదిస్థాన సంఖ్యలుగల, ఆయా గ్రతుల సంకలనజన్య పదకములనుకూడి పూర్వధ్రువము జేర్చగా మధ్య గ్రహంబగుననుట.

ఇపుడు, మూడు శ్లోకములచే రవ్యాది గ్రహమందోచ్చలకు పూర్వధ్రువములు జెప్పఁబడును.

శ్లో॥ ద్వ్యగేందునృపషడ్రామా స్సూర్యమందధ్రువ స్తతః ।
కుజస్య వేదదిఙ్నేత్ర నఖాస్సోమసుతస్యతు ॥

టీక॥ సూర్యమందధ్రువః = సూర్యునియొక్క మందోచ్చధ్రువము, ద్వ్యగేందునృపషడ్రామాః = ( ద్వి = ౨ రాసులును, ( అగ = ౭, ఇందు = ౧, ) = ౧౭ భాగలును, నృప = ౧౬ లిప్తలును, = ( షట్ = ౬, రామాః = 3, ) = 3౬ విలిప్తలును, కుజస్య = అంగారకునియొక్క మందోచ్చ = పూర్వధ్రువము, వేదదిఙ్నేత్రనఖాః—వేద= ౪ రాసులును, దిక్ - ౧౦ భాగలును, నేత్ర = ౨ లిప్తలును నఖాః = ౨౦ విలిప్తలును, సోమసుతస్యతు = బుధుని మందోచ్చ పూర్వధ్రువము.

శ్లో॥ శైలాశాతారకాదేవా స్సౌమ్యస్మందోచ్చధ్రువ స్తథా ।
పంచేందుద్వ్యంబరాక్ష్యబ్ధి కరాస్సురగురోర్ధ్రువః ॥

టీ॥ శైలాశాః = శైల - ౭ రాసులును, ఆశాః = ౧౦ భాగములును, తారకాః = ౨౭ లిప్తలును, దేవాః - 33 విలిప్తలును, గురోర్ధ్రువః = గురుని మందోచ్చ పూర్వధ్రువము, పంచేందు ద్వ్యంబరాక్ష్యబ్ధికరాః = పంచ - ౫ రాసులును, (ఇందు- ౧, ద్వి - ౨,) - ౨౧ భాగలును, (అంబర - ౦, అక్షి - ౨,) - ౨౦ లిప్తలును, (అబ్ధి- ౪, కరాః - ౨, - ౨౪ విలిప్తలును.

శ్లో॥ ద్వ్యంకేందుక్ష్మార్ధరవయ శ్శుక్రమందధ్రువో భవేత్ ।
సప్తాంగాశ్వితురంగాగ్ని దంతాస్సూర్యసుతస్యచ ॥

టీక॥ శుక్రమందధ్రువః = శుక్రుని మందోచ్చ పూర్వధ్రువము, ద్వ్యంకేందుక్ష్మార్ధరవయః - ద్వి - ౨ రాసులును, ( అంక - ౯, ఇందు - ౧, ) - ౧౯ భాగలును [ క్ష్మ - ౧, అర్ధ - ౫, ] ౫౧ లిప్తలును రవయః ౧౨ విలిప్తలును, భవేత్ - అగును.



సూర్యసుతస్యచ - శని మందోచ్చ పూర్వధ్రువము, సప్తాంగాశ్వితురంగాగ్నిదంతాః - సప్త - ౭ రాసులును, [అంగ - ౬, అశ్వి - ౨;] - ౨౬ భాగలును, [తురంగ - ౭, అగ్ని - 3,] - 3౭ లిప్తలును, దంతాః - 3౨ విలిప్తలును, (భవేత్) అగును.

## మందోచ్చ పూర్వ ధ్రువములు.

| | రాశి- భాగ-లిప్త - విలిప్తలు | | రాశి- భాగ-లిప్త - విలిప్తలు. |
|---|---|---|---|
| రవికి | ౨—౧౭-౧౬—3౬ | గురునకు | ౫—౨౧-౨౦—౨౪ |
| కుజునకు | ౪—౧౦- ౨—౨౦ | శుక్రునకు | ౨—౧౯-౫౧—౧౨ |
| బుధునకు | ౭—౧౦-౨౭—33 | శనికి | ౭—౨౬-3౭—3౨ |

ఇపుడు, గ్రహముల మందోచ్చ పూర్వ ధ్రువంబులకు రెండు శ్లోకములచే సంస్కారమును జెప్పఁబడును

శ్లో॥ ధ్రువాబ్దాః క్రమతశ్శైల రూపబాణైర్విభాజితాః।
శూన్యాష్టాంకైః కృతాబ్ధ్యక్షైః నయనాశ్వికరై స్తతః॥

టీ॥ ధ్రువాబ్దాః - ధ్రువాబ్దములు, క్రమతః - మందోచ్చ గ్రహ క్రమమున శైలరూపబాణైః - [శైల - ౭, రూప - ౧, బాణైః - ౫,] - ౫౧౭ చేతను, శూన్యాష్టాంకైః - [శూన్య - ౦, అష్ట - ౮, అంకైః - ౯,] - ౯౮౦ చేతను, కృతాబ్ధ్యక్షైః- [కృత - ౪, అబ్ధి - ౪, అక్షైః - ౫, - ౫౪౪ చేతను, నయనాశ్వికరైః - [నయన-౨, అశ్వి - ౨, కరైః - ౨,] - ౨౨౨ చేతను; తతః - అనంతరము.

శ్లో॥ యుగాద్రిరామైరష్టాక్షి చంద్రాక్షైస్సంహృతాః ఫలం ।
కలాదికం స్యాన్మందఫలం ధ్రువేషుసతతంయుజేత్ ॥

టీ॥ యుగాద్రిరామైః - [యుగ - ౪, అద్రి - ౭, రామైః - 3,] - 3౭౪ చేతను, అష్టాక్షిచంద్రాక్షైః - [అష్ట - ౮, అక్షి - ౨, చంద్ర - ౧, అక్షైః - ౫,]- ౫౧౨౮ చేతను, సంహృతాః - భాగింపబడుచుండగా నేర్పడిన, ఫలం - లబ్ధము, కలాదికం - లిప్తావిలిప్తలు, స్యాత్ - అగును. దానిని, సతతం - ఎల్లపుడును, మందధ్రువేషు - మందోచ్చ పూర్వ ధ్రువములయందు, యుజేత్ - కూడవలెను.

## పూర్వధృవములకు మందోచ్చ సంస్కార భాగహార సంఖ్యలు.

| | | | |
|---|---|---|---|
| రవికి | ౫౧౭ | గురునకు | ౨౨౨ |
| కుజునకు | ౯౮౦ | శుక్రునకు | ౩౭౪ |
| బుధునకు | ౫౪౪ | శనికి | ౫౧౨౮ |

ధృవాబ్దములను ఆయా గ్రహ భాగ హార సంఖ్యలచే భాగించగా లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చే గుణించి మరల భాగించగా లబ్ధము విలిప్తలగును. ఈ లబ్ధ లిప్తా విలిప్తలను ఆ యా గ్రహముల మందోచ్చ పూర్వధృవములలో కలపగా స్ఫుట మందోచ్చలగుననుట

### ఉదాహరణము.

ధృవాబ్దములు ౪౦౯ - వీనిని ౫౧౭ చే భాగించగా లబ్ధము లిప్తలు-౦-శేషమగు ౪౦౯ -ను ౬౦ చే గుణించి మరల ౫౧౭ చే భాగించగా లబ్ధము విలిప్తలు - ౪౭ - వీనిని రవి మందోచ్చ పూర్వధృవములో కలపగా ౨-౧౭-౧౭-౨౩ ఇదియే రవి స్ఫుటమందోచ్చమగును. ఈ ప్రకారము కుజాది స్ఫుటమందోచ్చములను సాధించవలయును. కుజ స్ఫుటమందోచ్చము ౪-౧౦-౨-౪౫ అయినది.

### అయనాంశ పూర్వధృవంబుఁ జెప్పబడును.

శ్లో॥ అయనాంశాఃకృతేంద్వగ్ని మహీకమలబాంధవాః ।
చక్రప్రాక్చలనాదద్యవృద్ధిం యాంతిధనాభిధాః ॥

టీ॥ అయనాంశాః = అయనాంశములు, కృతేంద్వగ్ని మహీకమలబాంధవాః [ కృత = ౪, ఇందు = ౧, ] - ౧౪ భాగలును, ( అగ్ని - ౩, మహీ - ౧, ) - ౧౩ లిప్తలును, కమలబాంధవాః - ౧౨ విలిప్తలును, అగును. అద్య - ఇపుడు చక్రప్రాక్చలనాత్ = చక్రముయొక్క పూర్వ చలనంబువలన, ధనాభిధాః = ధన నామంబుగల ఆ అయనాంశములు, వృద్ధింయాంతి = వృద్ధిపొందును.

తా॥ భాగలు ౧౪ లిప్తలు ౧౩ విలిపలు ౧౨ ఈ భాగ లిప్తావిలిప్తలు అయనాంశ పూర్వ ధృవంబగును. ఇపుడు చక్రముయొక్క పూర్వ చలనంబగుట వలన ఆ అయన భాగలు వృద్ధి బొందుచున్నవనుట.



## పూర్వోక్త అయనాంశములకు సంస్కారము జెప్పఁబడును.

శ్లో॥ ధృవాబ్దాస్స్వదశాంశోనా షష్టిభక్తాశ్చయత్ఫలం ।
తదంశాద్యంధృవేయోజ్యం సంభవంత్యయనాంశకాః ॥

టీ॥ ధృవాబ్దాః = ధృవాబ్దములు, స్వదశాంశోనాః = స్వ - తమ యొక్క, దశాంశ = పదవ భాగముచేత, ఊనాః = తగ్గినవగుచు, షష్టిభక్తాశ్చ = ౬౦ చే భాగింపబడుచుండ, యత్ఫలం = ఏలబ్ధముగలదో, తదంశాద్యం = ఆ భాగాదిఫలమును, ధృవే = అయనాంశ పూర్వ ధృవమందు, యోజ్యం = కలపదగినది. ఇట్లు చేయగా, అయనాంశకాః = స్ఫుట అయనాంశములు, సంభవంతి = అగుచున్నవి.

తా॥ ధృవాబ్దములను లిప్తలుగా భావించుకొని వానిని ౧౦ చే భాగించగా లబ్ధము లిప్తలగును. ఆ శేషమును ౬౦ చే గుణించి మరల ౧౦ చే భాగించగా లబ్ధము విలిప్తలగును. ఇట్లు యేర్పడిన లబ్ధ లిప్తావిలిప్తలను పూర్వోక్తధృవాబ్దరూప లిప్తలయందు తివచగా మిగిలిన లిప్తలను ౬౦ చే భాగించి భాగలుచెసికొని పూర్వోక్త అయనాంశ పూర్వధృవములో కలపగా స్ఫుట అయనాంశము లగుననుట.

### ఉదహరణము.

ధృవాబ్దములు ౪౦౯ వీనిని లిప్తలుగా భావించుకొని ౧౦ చె భాగించగా లబ్ధము లిప్తలు ౪౦ ఆశేషమగు ౯ ని ౬౦ చేత గుణించగా ౫౪౦ దీనిని మరల ౧౦ చేత భాగించగా లబ్ధము విలిప్తలు ౫౪ ఈ లబ్ధ లిప్తావిలిప్తలగు ౪౦-౫౪ ను, పూర్వోక్తలిప్తలగు ౪౦౯-౦ లో తివచగా శేష లిప్తావిలిప్తలు ౩౬౮-౬ ఇందు, లిప్తా సంఖ్యను ౬౦ చె భాగించగా లబ్ధము భాగలు ౬ లిప్తలు ౮ విలిప్తలు ౬ ఈ భాగాది ఫలమును పూర్వోక్త అయనాంశ పూర్వధృవభాగాదికమగు ౧౪-౧౩-౧౨ లో కూడగా ౨౦-౨౧-౧౮ ఇవియే స్ఫుట అయనాశములగును. మఱియొక విశేషము గలదు. ఇష్టకాలమునకు చైత్రాది గత మాసంబు లెన్ని గలవో వానికి మాసము ౧ కి ౪½ విలిప్తల వంతున పూర్వోక్త స్ఫుట అయనాంశములలో చేర్చగా తాత్కాలికాయనాంశములగును. ఇట్లు జేయగా తాత్కాలిక అయనాంశము ౨౦-౨౧-౨౨.

ఈ అయనాంశముల వల్ల ప్రయోజనము జెప్పఁబడును.

శ్లో॥ అగ్రేయనాంశైఃఖేటానా మహర్మానావమాదయః ।
సాధ్యాంతేర్కస్యమేషాది రాశీనామయనానిచ ॥

టీ॥ అగ్రే = ముందరను, అయనాంశైః = అయిన భాగములచేత, ఖేటానాం = గ్రహములకు, అహర్మానావమాదయః = అహర్మాన = అహఃప్రమాణంబును, తద్ద్వారా, అవమాదయః = అవమాదులును, అర్కస్య = సూర్యునకు, మేషాదిరాశీనాం = మేషాదిరాసులయొక్క, అయనానిచ = అయిన ప్రవేశములును, సాధ్యంతే = సాధింపఁబడుచున్నవి.

తా॥ స్ఫుటాధ్యాయాదులయందు యీ అయినాంశములచేత, అహఃప్రమాణంబును, తద్ద్వారా, అవమాదులును మఱియు సూర్యాది గ్రహములకు మేషాదిరాశ్యయన ప్రవేశాదులును సాధింపఁబడుచున్నవని యభిప్రాయము.

ఇది మధ్యాధికార స్సమాప్తః

అథ రవి చంద్ర స్ఫుటాధ్యాయ ప్రారంభః.

శ్లో॥ లక్ష్మీనివాసగృహస్యయః ప్రతిదినంపద్మస్యసౌభాగ్యదః ।
యచ్చారేణకలాదిభోగకలనః కాలస్తుసంజాయతే ॥
యశ్చక్షుర్జగతామమందఫలదం సాక్షీచయఃకర్మణాం ।
తంవందేశ్రితిమందిరం ప్రణమతామోజస్కరంభాస్కరమ్ ॥

అథాత్ర మంద భుజ సంస్కార క్రమః.

శ్లో॥ స్వోచ్చోనగ్రహోనం కేంద్రంస్యా త్తత్పదేవిషమేగతః ।
యుగ్మేగమ్యోమందభుజ స్తద్రాశింవ్యోమవహ్నిభిః ॥



టీ॥ గ్రహోనం = గ్రహము తీవచఁబడిన, స్వోచ్చం = తన మందోచ్చము, కేంద్రింస్యాత్ = కేంద్రమగును. తత్ = ఆకేంద్రము, విషమేపదే = ఓజపదమందు, గతః = గతించినది, మందభుజః = మందభుజయగును. యుగ్మే = యుగ్మపదమందు, గమ్యః = మిగిలినది, మందభుజః = మందభుజయగును. తద్రాశిం = ఆభుజరాశి స్థానమందుండు సంఖ్యను, వ్యోమవహ్నిభిః = (వ్యోమ–౦, వహ్నిభిః–3,) = 3౦ చేతను.

శ్లో॥ సంగుణ్యభాగసంయుక్తా త్పదకంరవిచంద్రయోః ।
ఏవమేవ కుజాదీనాం స్యాన్మంద పదకక్రమః ॥

టీ॥ సంగుణ్య = గుణించి, భాగసంయుక్తాత్ = క్రింది భాగలు కలుపుట వలన, రవి చంద్రయోః = సూర్యచంద్రులకు, పదకం = పదక సంఖ్యయగును, ఏవమేవ = ఈప్రకారమే, కుజాదీనాం = కుజాది పంచ గ్రహములకు, మందపదకక్రమః = మంద పదక సంఖ్యాజ్ఞాన క్రమము, స్యాత్ = అగును.

తా॥ గ్రహమును తన మందోచ్చములో తీవచగా మిగిలినది మందకేంద్రమగును. ఆ కేంద్రము 3 రాసులవఱకు ఓజపదమనియు, 3 రాసులకు పైన ౬ రాసులవఱకు యుగ్మపదమనియు, ౬ రాసులకు పైన ౯ రాసులవఱకుమఱల ఓజపదమనియు, ౯ రాసులకు పైన ౧౨ రాసులవఱకు మఱల యుగ్మపదమనియు నెఱుంగవలయు. అందు ఓజపదమందు గతము భుజయగును. యుగ్మపదమందు (గమ్యము) మిగిలినది భుజ యగును. ఇట్లు మంద భుజను సాధించి, ఆ భుజ రాశి స్థానమందుండు సంఖ్యను 3౦ చేత గుణించి క్రింది భాగలు కలపగా రవి చంద్రులకు మంద పదకంబగును. ఈ ప్రకారమే కుజాదులకును మందపదక సంఖ్యను యెరుంగవలెననుట.

ఈ పై జెప్పఁబడిన మంద భుజసాధన క్రమమునే, మఱల స్పష్టముగా జెప్పఁబడును.

శ్లో॥ కేంద్రేత్రి భాగాల్పేతు తదేవబాహుం స్త్రిభోర్ధ్వకే చక్రదళా
ద్విశోధ్యా । షడ్భాధికే షడ్రహితం భుజ్యస్యా న్నవాధికం
చేద్భగణాద్విశోధ్యా ॥

టీ॥ కేంద్ర = కేంద్రము, త్రిభాగాన్వేతు = మూడు రాసులకంటె తక్కు వైనయెడల, తదేవ = ఆ కేంద్రిమే, బాహుః = భుజయగును. త్రిభ్యః = మూడు రాసులకంటె, అధికే = అధికమైనయెడల, చక్రిదళాత్ = ఆఱురాసులవలన శోధ్యం = శోధింపగా మిగిలినది. భుజయగును, షడ్భాధికే = ఆఱురాసులకంటె అధికమైనయెడల, షడ్రహితం = ఆఱు తీవచగా మిలిగినది, భుజస్స్యాత్ = భుజయగును, నవాధికంచేత్ = తొమ్మిది రాసులకంటె అధికమైయెడల, భగణాత్ = చక్రిము వల్ల (అనఁగా = ౧౨ రాసులవల్ల ననుట) విశోధ్యం = తీవచగా మిగిలినది భుజయగును.

తా॥ గ్రిహమును తన మందోచ్చముతో తీవచగా మిగిలినది మంద కేంద్రయగును. ఆ కేంద్రము 3 రాసులకంటె తక్కువైనయెడల, అదియే భుజయగును. మఱియు, ఆ కేంద్రిము 3 రాసులకంటె నధికమై ౬ రాసులలోగా నున్నయెడల దానిని ౬ రాసులలో తీవచగా మిగిలినది భుజయగును. మఱియు, ఆ కేంద్రము, ౬ రాసులకంటె నధికమై ౯ రాసులలోగా నున్నయెడల దానిలో ౬ రాసులను తీవచగా మిగిలినది భుజయగును. మఱియు, ఆ కేంద్రము, ౯ రాసులకంటె నధికమై ౧౨ రాసులలోగా నున్నయెడల దానిని ౧౨ రాసులలో తీవచగా మిగిలినది భుజయగుననుట.

ఉదహరణము.

| | | | |
|---|---|---|---|
| రవి మందోచ్చము | ౨-౧౭-౧౭-౨౩ | చంద్రోచ్చము | ౫-౧౪-౩౧-౯ |
| రవి భుజ ఫల భాగ సంస్కారము చేయనిమధ్యాహ్న మధ్యరవిః...... | ౧-౨౩- ౩-౪౧ | రవి భుజ ఫలభాగ సంస్కారము జేసినమధ్యాహ్న మధ్య చంద్రుడు | ౨-౨౯-౫౬-౨౯ |
| మంద కేంద్రిము. | ౦-౨౪-౧౩-౪౨ | మంద కేంద్రిము | ౨-౧౪-౩౪-౪౦ |

ఈ కేంద్రిదము 3 రాసులలోగా నున్నందున ఇదియే మంద భుజయగును.

ఈ కేంద్రము మూడు రాసులలోగా నున్నందున, ఇదియే మంద భుజయగును.



మఱియు, కేంద్రము, 3 రాసులకంటె నధికమై ౯ రాసులకంటె తక్కువైనయెడల, అది కర్క్యాది కేంద్రమనియు, ౯ రాసులకంటె నధికమై 3 రాసులకంటె తక్కువైనయెడల, అది మకరాది కేంద్రిమనియు నెఱుంగవలెను. ఈ కర్క్యాది మకరాది కేంద్రజ్ఞానము గ్రహగతుల సంస్కారాదులయందు ప్రయోజనమగును. గనుక, సర్వగ్రహంబులకును, యీప్రకారమే కర్క్యాది మకరాది కేంద్రిముల నెఱుంగదగినది. మఱియు, కేంద్రిము ౬ రాసులకంటె తక్కువైనయెడల మేషాది కేంద్రము (ఉత్తరము) అనియు, ౬ రాసులకంటె పైన ౧౨ రాసులలోగా నున్నయెడల, తులాది కేంద్రిము (దక్షిణము) అనియు నెఱుంగునది. ఇట్లు కేంద్రము నెఱింగి యీ కేంద్రిమువల్ల పూర్వోక్త ప్రికారము మంద భుజను సాధించి, ఆ భుజ రాసులను ౩౦ చేత గుణించి క్రింది భాగలు కలుపుకొనగా రవికి ౨౪ మంద పదకంబులు, చంద్రునకు ౭౪ మంద పదకంబును అయినది. ఇట్లు పదక సంఖ్యలను యేర్పరచుకొని ఈ గ్రింథమందు క్రింద వ్రాయబడిన రవి చంద్రుల ఆ యా మంద పదక ఫల లిప్తావిలిప్తలనున్నూ, ఆ యా పదకముల అంతర లిప్తావిలిప్తలనున్నూ, కర్క్యాది మకరాది స్ఫుటగతులనున్నూ, వ్రాసుకొనవలెను.

ఉదాహరణము.

రవి మంద పదకము - ౨౪ - వది. ౫౩ - ౫౧ - అంతరం - ౨ - ౫ మకరాది స్ఫుటగతి - ౫౬ - ౫, చంద్రిమంద పదకము. ౭౪-వది. ౨౯౧-౯-అంతరం-౧-౨౪ మకరాది స్ఫుటగతి-౭౭౨-౧౮,

రవి చంద్రుల స్ఫుటక్రమమును రెండు శ్లోకములచే జెప్పఁబడును.

శ్లో॥ భుజలిప్తావిలిప్తాస్తు పదకాంతరతాడితాః ।
షష్టిభక్తాఃఫలంయోజ్యం పదకేమందనామకే ॥

టీ॥ భుజలిప్తావిలిప్తాస్తు = భుజరాశ్యాదికమందుండు లిప్తావిలిప్తలు, పదకాంతరతాడితాః = పదక = ఆ యా మంద పదకము యొక్క, అంతరం = అంతరలిప్తా

విలిప్తలచేత, తాడితాః = గుణింపబడినవై, షష్టిభక్తాః = ౬౦ చేత భాగింపబడగా ఫలం = లబ్ధమైన లిప్తాదికమును, మందనామకే = మందమనెడు నామంబుగల, పదకే, పదక లిప్తాదికమందు, యోజ్యం = కూడదగినది, అట్లు కూర్చగా,

శ్లో॥ ఏతద్బాహుఫలం కేంద్రే మేషాదౌతుధనంయుజేత్ ।
ఋణంతులాదిగే కేంద్రే మధ్యఖేటాద్వియోజయేత్ ॥

టీ॥ ఏతత్ = ఇది, బాహుఫలం = భుజాఫలమగును. కేంద్రే = కేంద్రము—మేషాదౌతు - మేషాదియైనయెడల, ధనం = ధనమనెడి సంజ్ఞగల ఆ భుజాఫలమును, యుజేత్ = మధ్య గ్రహములో కలపవలెను. కేంద్రే = కేంద్రము, తులాదిగే = తులాదిని పొందియున్నయెడల, ఋణం = ఋణ సంజ్ఞగల ఆ భుజాఫలమును, మధ్య, ఖేటాత్ = మధ్య గ్రహమునుండి, వియోజయేత్ = తివచవలెను.

తా॥ భుజ రాశ్యాదికమందుండు లిప్తావిలిప్తలను పదకాంతర లిప్తావిలిప్తల చేత, చతుష్ప్రితి న్యాయముగా గుణించి (అది యెట్లనగా మొదటి ప్రితియందు లిప్తలును, దానికిరింద విలిప్తలును, దానికిరింద మఱల లిప్తలును, దానిక్రింద మఱల విలిప్తలును, ఇట్లు చతుష్ప్రితులనుగాబెట్టి అందుపై రెండు ప్రతులను పదకాంతర ప్తలచేతనున్నూ, కిరిందనుండు రెండు ప్రితులను పదకాంతర విలిప్తలచేతనున్నూ, ప్రిత్యేకముగ గుణించి, నాలగవ ప్రితిని ౬౦ చేత భాగించి, ఆ లబ్ధమునున్నూ పై రెండు ప్రితులనున్నూ జేర్చి, దానిని మఱల ౬౦ చేత భాగించి, ఆ లబ్ధమును పై ప్రితియందు కలపగా విలిప్తలగును. దానిని ౬౦ చేత భాగించగా లబ్ధము లిప్తలును శేషమును విలిప్తలునగును. ఈ లిప్తావిలిప్తలను మందపదక లిప్తావిలిప్తల యందు కలపగా అదియే భుజాఫలము (మేషాది కేంద్రమైనయెడల ధనం సంజ్ఞగలది. గనుక, మధ్య గ్రహములో కలపవలసినది. తులాది కేంద్రమైనయెడల ఆ భుజాఫలము ఋణ సంజ్ఞగలది. గనుక, మధ్య గ్రహములో తివచవలెను.) ఇట్లు ధన ఋణములెఱిగి సంస్కరించగా సూర్యుడుగాని చంద్రుడుగాని స్ఫుటమగును.



ఉదాహరణము.

పూర్వోక్త రవియొక్క రాశ్యాది భుజయందుండు లిప్తావిలిప్తలకును, పదకాంతర లిప్తావిలిప్తలకును, చతుష్ప్రితి న్యాయగుణనము.

| లిప్తలు | విలిప్తలు | లిప్తలు | విలిప్తలు |
|---|---|---|---|
| ౧౩ | ౪౨ | ౧౩ | ౪౨ |
| ౨ | ౨ | ౫ | ౫ |
| ౨౬ | ౮౪ | ౬౫ | ౨౧౦ |

నాలగవ ప్రితిని ౬౦ చే భాగించగా లబ్ధము ౩ దీనితో పై రెండు ప్రితులను జేర్చగా ౧౫౨ అగును. దీనిని మఱల ౬౦ చే భాగించగా లబ్ధము ౨ దీనిని పైప్రితులయందు కలపగా ౨౮ ఇవి విలిప్తలగును. వీనిని ౬౦ చే భాగించగా లబ్ధము లిప్తలు ౦ విలిప్తలు ౨౮. ఈ లిప్తావిలిప్తలను రవి మందపదక లిప్తావిలిప్తలగు, ౫౩-౫౧ లో కలపగా ౫౪-౧౯ ఇదియే రవి భుజాఫలమనడును. ఈ రవి భుజాఫల లిప్తావిలిప్తలు (మేషాది కేంద్రమగుటచేత) ధన సంజ్ఞగలవి. గనుక, మధ్య రవిలో కలప రాశ్యాదిగా ౧-౨౩-౫౮-౦ స్ఫుట రవి యాయెను. ఈ పూర్వోక్త ప్రకారము చంద్రుని భుజ రాశ్యాదిక మందుండు లిప్తావిలిప్తలను ఆ పదకాంతర లిప్తావిప్తలచెత చతుష్ప్రితి న్యాయముగా గుణించి సర్వము పూర్వోక్త ప్రికారముచేయ రాశ్యాదిగా ౩-౪-౪౮-౨౬ స్ఫుట చంద్రుడాయెను. ఇట్లు చతుష్ప్రితి న్యాయమును అంతటను నెఱుంగునది. ఇట్లు మధ్యాహ్న మధ్య గ్రిహములను బెట్టుకొని స్ఫుటీకరించితిమి గనుక ఈ స్ఫుటములైన రవి చంద్రులను మధ్యాహ్న సమయస్థులనుగా నెఱుంగవలెను.

## గ్రిహములకు మంద స్ఫుటగతి సాధన క్రిమము.

శ్లో॥ పదాంతరహతాభుక్తిః ఖేటానాంషష్టిభాజితా ।
ఫలంమధ్యగతౌస్వర్ణం కేంద్రేకర్కిమృగాదిగే ॥

టీ॥ ఖేటానాం = గ్రహములయొక్క, భుక్తిః = మందగతి, పదాంతరహతా = పదాంతర - ఆ యా మంద పద కాంతరముచేత, హతా = గుణింపబడినదై, షష్టిభాజితా = ౬౦ చేత భాగింపబడగా, ఫలం = లబ్ధమగు లిప్తాదికము, కేంద్రే =

కేంద్రము, కర్కి-మృగాదిగే = కర్క్యాదిమకరాదిని పొందుచుండగా మధ్యగతౌ = తమ తమ మధ్యగతియందు, స్వర్ణం = ధన ఋణ సంజ్ఞగలది యగును.

తా॥ గ్రహ మధ్య గతి లిప్తావిలిప్తలను, మందపదకాంతర లిప్తావిలిప్తలచేత, చతుష్ప్రిత న్యాయముగా గుణించి ౬౦ చేత భాగించగా లబ్ధము లిప్తలును, శేషము విలిప్తలునగును. ఈ లిప్తావిలిప్తలను (కర్క్యాది కేంద్రమైన యెడల గ్రహ మధ్య గతిలో కలపవలెను. మకరాది కేంద్రిమైనయెడల గ్రహ మధ్య గతిలో తీవవలెను.) ఇట్లు చేయగా మంద స్ఫుటగతియగును. రవి చంద్రుల మధ్యగతులను పూర్వోక్త ప్రకారము స్ఫుటముచేసి పదక ప్రదర్శినిలో ఆ యా పదకములయందు వ్రాయఁబడి యున్నవి. గనుక రవి చంద్రులకు గతి స్ఫుటము చేయవలసిన పనిలేదు.

శ్లో॥ ఏవంగ్రహాణాంసర్వేషాం మందస్ఫుటమితీరితం ।
చంద్రసూర్యౌస్ఫుటౌస్యాతాం మాందేనైకేనకర్మణా ॥

టీ॥ ఏవం = ఈ పూర్వోక్త ప్రకారము, సర్వేషాం = సకలములైన, గ్రహాణాం = గ్రహములకు, మంద స్ఫుటమితి = మందస్ఫుట క్రమమని, ఈరితం = చెప్పబడినది, ఏకేన = ఒకటియగు, మాందేన = మంద నామంబుగల; కర్మణా = కర్మముచేత, చంద్రసూర్యౌ = చంద్రరవులనెడి గ్రహములు, స్ఫుటౌ = స్ఫుటములు, స్యాతాం = అయినవి.

తా॥ ఈపూర్వోక్త ప్రకారము సర్వ గ్రహంబులకును మంద స్ఫుటక్రమమని చెప్పఁబడినది. అందు పూర్వోక్తమైన ఒక మంద సంస్కారముచేతనే రవి చంద్రులు స్ఫుటమగుదురనుట.

## దినార్ధ సాధనము కొఱకు చరఖండములం దెచ్చు క్రమము.

శ్లో॥ ఖాక్షిఘ్నాక్షప్రభాచాద్యా స్వాష్టాంశోనాహిమధ్యమా ।
త్రిభాజితఫలంచాంత్యా చరజ్యాస్స్వదేశజా ॥

టీ॥ అక్షప్రభా = స్వదేశ విషువచ్ఛాయ, ఖాక్షిఘ్నా = (ఖ - ౦ అక్షి - ౨) = ౨౦ చేత, ఘ్నా = గుణింపఁబడునది. ఆద్యా = ఆదిచరజ్యయగును, స్వాష్టాంశోనాహి = స్వ - తనయొక్క, (ఆదిచరజ్యయొక్క) అష్టాంశ = ఐదవ భాగముచేత ఊనా = తక్కువగునది, మధ్యమా = మధ్యచరజ్యయగును. త్రిభాజితఫలం = త్రిభాజిత - 3 చేత భాగింపబడిన; ఫలం = లబ్ధము, స్వదేశజా - స్వదేశీయమైన, అంత్యా = అంత్యమగు, చరజ్యా, స్యాత్ = అగును.



శ్లో॥ ఏతస్త్వర్ధీకృతాస్త్రీణి చరఖండాన్యనుక్రమాత్ ।
భవంత్యేతైస్స్వదయాహార్మానాదీనిచసాధయేత్ ॥

టీ॥ ఏతాః - ఈ ఆది మధ్యమాంత్యచరజ్యలు మూడును, అర్ధీకృతాః = ప్రత్యేకముగ నర్ధీకరింపబడినవై, అనుక్రమాత్ = పూర్వోక్త క్రమంబున, త్రీణి = మూడగు, చరఖండాని - చరఖండములు, భవంతి - అగుచున్నవి. ఏతైః - ఈ చరఖండముల చేత, అహార్మానాదీనిచ = అహః ప్రమాణము మొదలైన వానిని, సాధయేత్ - సాధించవలెను.

తా॥ స్వదేశ విషువచ్ఛాయారూపమైన అంగుళ వియంగుళములను ౨౦ చేత గుణించిన రాశి ఆదిచరజ్యయగును మఱియు ఆ ఆదిచరజ్యయందు తన ఐదవభాగము తీవచగా మధ్యచరజ్యయగును. మఱియు ఆదిచరజ్యయొక్క మూడవ భాగము అంత్యచరజ్యయగును. ఈ ఆదిమధ్యమ అంత్యచరజ్యలు మూడును ప్రత్యేకముగ అర్ధీకరింపబడినవై క్రమముగ ఆదిచరఖండమనియు మధ్యచరఖండమనియు అంత్యచర ఖండమనియుఁ జెప్పఁబడును. వీనిచేత మేషాదిరాసుల స్వదేశ స్వోదయములును (అనఁగా రాశి ప్రమాణములు) అహః ప్రమాణాదులును సాధింపబడుననుట.

## ఉదాహరణము.

కుండినీపట్టణమునకు విషువచ్ఛాయ అంగుళములు 3, వియంగుళములు 3౬ ఈ అంగుళ రాశిని ౨౦ చె గుణించగా ౭౨౦ వియంగుళము లాయెను. వియంగుళములు ౬౦ కి ౧ అంగుళము గనుక ౬౦ చె భాగించగా లబ్ధము అంగుళములు ౧౨ వచ్చినది. మఱియు పూర్వోక్త విషువచ్ఛాయాంగుళములగు 3 ని ౨౦ చే గుణించగా అంగుళములు ౬౦ వీనియందు పూర్వోక్త ౧౨ అంగుళములం జేర్చగా వెరశి ౭౨ ఇది ఆదిచర్యయగును. దీనియందు దీని అయిదవ భాగమగు ౧౪ తీవచగా మిగిలినది. ౫౮ ఇది మధ్య చరజ్యయగును. మఱియు ఆదిచరజ్యను 3 చేత భాగించగా లబ్ధము ౨౪ ఇది అంత్యచరజ్యయగును. ఈ ఆది మధ్య అంత్య చరజ్యములు మూడును ప్రత్యేకముగ అర్ధీకరింప - (సగము చేయ) ఆదిచరఖండము

3౬ మధ్య చరఖండము, ౨౯౦, అంత్య చరఖండము ౧౨ అగును. ఈ ప్రకారమే ఆయా స్వదేశ విషువచ్ఛాయాంగుళ వియంగుళములచేత ఆయా స్వదేశ చరఖండములను సాధింపవలయును. చెన్నపట్టణమునకు విషువచ్ఛాయాంగుళ వియంగుళములు ౭-౪౮ కాళహస్తికి విషువచ్ఛాయ 3-౬. ఈ విషువచ్ఛాయ, లంక మొదలుకొని ఉత్తర దిశను క్రమముగా వృద్ధిపొందుచున్నది.

### దినార్ధ అహః ప్రమాణ సాధన క్రమము.

శ్లో॥ సాయనాంశార్క కేంద్రస్య భుజరాశ్యంకనిశ్చితం ।
గతానాంచరఖండానాం యోగంరాశితలేక్షిపేత్ ॥

టీ॥ సాయనాంశార్క కేంద్రస్య = సాయనాంశ = అయనాంశములతో గూడిన, అర్క కేంద్రస్య = రవి కేంద్రము యొక్క, భుజరాశ్యంకనిశ్చితం = భుజ రాశ్యంక = భుజరాశి సంఖ్యలచేత, నిశ్చితం = నిర్ణయింపబడిన, గతానాం = గడచిన, చరఖండానాం = చరఖండములయొక్క, యోగం = కూడికను, రాశితలే = ఆభుజ రాశి స్థానమందు, క్షిపేత్ = ఉంచవలెను.

శ్లో॥ భాగాదీన్యేష్యఖండేన హత్వామానాప్తజంఫలం ।
చరార్ధయోగసంయోగా జ్జాతాశ్చరవినాడికాః ॥

టీ॥ భాగాదీన్ = ఆ భుజ భాగలిప్తావిలిప్తలను, ఏష్యఖండేన = పైఖండము చేత, హత్వా = గుణించి, మానాప్తజం = మాన = ఆయా ప్రమాణముచేత, (అనగా విలిప్తలను ౬౦ చేతను, లిప్తలను ౬౦ చేతను, భాగలను 3౦ చేత ననుట) ఆప్తజ = భాగించుటవల్ల కలిగిన, ఫలం = లబ్ధమును, చరార్ధయోగసంయోగాత్ = చరార్ధ = చరఖండములయొక్క, యోగ = కూడికయగు, (అనగా పూర్వోక్త గత చరఖండమునుంచిన రాశి స్థానమందు) సంయోగాత్ = కలుపుటవలన, జాతాః = అయినవి, చరవినాడికాః = చరవినాడిక లనబడును.

శ్లో॥ తాష్షష్ట్యాప్తఫలంనాడ్య స్తచ్ఛేషాస్తువినాడికాః ।
ఏతాస్సౌమ్యాశ్చయామ్యాశ్చ చరనాడీవినాడికాః ।
భవంతిసాయనేసూర్యే మేషజూకాద్విగేస్థితి ॥



టీ॥ తాః = ఆచరవినాడికలను, షష్ట్యాప్తఫలం = షష్ట్యాప్త = ౬౦ చేత భాగించుటవల్ల కలిగిన, ఫలం = లబ్ధము, నాడ్యః = గడియలగును. తచ్ఛేషాస్తు = దాని శేషములు, వినాడికాః = విగడియలగును, సాయనేసూర్యే = సాయన రవి (అయనాంశములతో గూడిన రవి) మేషజూకాదిగేసతి = మేషాది తులాదిని పొందుచుండగా, ఏతాః = ఈ, చరనాడీవినాడికాః = చర ఘడియా విఘడియలు, సౌమ్యాశ్చ = సౌమ్యములుగాను, యామ్యాశ్చ = యామ్యములుగాను, భవంతి = అగుచున్నవి.

శ్లో॥ లంకాదినార్ధేసంయోజ్యా శ్చోత్తరాశ్చరవినాడికాః ।
దక్షిణాశ్చేద్వియోజ్యాస్త చ్ఛేషందినదళంభవేత్ ।
దినార్ధద్విగుణంస్వస్వ దేశాహర్మానముచ్యతే ॥

టీ॥ ఉత్తరా = సౌమ్యములైనయెడల, చరవినాడికాః = చరవిఘడియలను, లంకాదినార్ధే = లంకాదినార్ధమగు = ౧౫ యందు, సంయోజ్యాః = కలపదగినవి. ఇట్లుచేయ దినార్ధమగును.

దక్షిణాశ్చేత్ = యామ్యములైనయెడల, వియోజ్యాః = ౧౫ యందు తీసివ దగినవి. ఇట్లుచేయ, తచ్ఛేషం = ఆశేషము, దినదళం = దినార్ధము, భవేత్ = అగును, దినార్ధ ద్విగుణం = రెంట గుణింపబడిన దినార్ధము, స్వస్వదేశాహర్మానం స్వస్వదేశ = తమ తమ దేశముయొక్క, అహర్మానం = అహఃప్రమాణమని, ఉచ్యతే = చెప్పఁబడును.

శ్లో॥ షష్ట్యాహీనమహర్మానం స్యాన్నిశాపరిమాణకం ।
షష్టిహీనంనిశామాన మహస్సంజాయతేసతా ॥

టీ॥ షష్ట్యా = ౬౦ చేత, హీనం = తగ్గిన, అహర్మానం = అహఃపరిమాణం, నిశాపరిమాణకం = రాత్రి ప్రమాణము, స్యాత్ = అగును, షష్టిహీనం = ౬౦ చేత తగ్గిన, నిశామానం = రాత్రి ప్రమాణము, సదా = ఎల్లప్పుడును, అహః = అహఃపరిమాణము, సంజాయతే = అగుచున్నవి.

తా॥ స్ఫుటరవిలో అయనాంశలు కలపగా సాయన రవియగును. ఈసాయన రవిని కేంద్రముగా భావించుకొని పూర్వోక్త ప్రకారము నందభుజను సాధించగా ఆ భుజ రాశి స్థానమందు సున్న వున్నయెడల ఆ భుజ భాగ లిప్తావిలిప్తలను ఆది

చర ఖండముచేత ప్రత్యేకముగ గుణించవలెను. మఱియు ఆ భుజ రాశి స్థానమందు ౧ టి వున్నయెడల ఆ రాశి స్థానమందు ఆదిచరఖండమును నిలిపి ఆ భుజ మధ్య చరఖండముచేత ప్రత్యేకముగ గుణించవలెను. మఱియు ఆ భుజ రాశి స్థానమందు ౨ వున్నయెడల ఆ రాశి స్థానమందు ఆదిమధ్య చరఖండములు రెండును నిలిపి ఆభుజ భాగాదులను అంత్య చర ఖండముచేతను ప్రత్యేకముగ గుణించి విలిప్తలను ౬౦ చేత భాగించి లబ్ధమును లిప్తలయందు కలిపి ఆలిప్తలను ౬౦ చే భాగించి లబ్ధమును భాగలయందు కలిపి ఆ భాగలను ౩౦ చేత భాగించి లబ్ధమును రాశి స్థానమందుండు చరఖండములయందు కలపగా చరవినాడికలగును. వానిని ౬౦ చేత భాగించగా లబ్ధము ఘడియలును శేషము విఘడియలునగును. ( ఈ ఘడియా విఘడియలు ) సాయన రవి ౬ రాసులలోగ నున్నయెడల ( మేషాది షట్కమందుండును ) గనుక సౌమ్యములనియు సాయన రవి ౬ రాసులకంటె పైన ౧౨ రాసులలోగ నున్నయెడల ( తులాది షట్కమందుండును ) గనుక అప్పుడు యామ్యములనియు జెప్పబడును. సౌమ్యములైనయెడల పైఘడియా విఘడియలను లంకాదినార్ధమగు ౧౫ గడియలలో కలపగా స్వదేశ దినార్ధమగును. యామ్యములైనయెడల ౧౫ ఘడియలలో తివచగా మిగిలినది స్వదేశదినార్ధమగును. ఇట్లు దినార్ధను సాధించుకొని దీనిని ౨ చెతను గుణించగా స్వదేశ అహఃప్రమాణమగును. అహఃప్రిమాణమును ౬౦ ఘడియలలో తివచగా రాత్రి ప్రిమాణమగును. రాత్రి ప్రమాణమును ౬౦ ఘడియలలో తివచగా అహఃప్రిమాణమగును.

## ఉదాహరణము.

రాశ్యాది స్ఫుట రవి ౧-౨౩-౫౮-౦ ఇదులో, అయనాంశములు ౨౦-౨౧-౨౭ వీనిని కలపగా సాయనరవిః ౨-౧౪-౧౯-౨౭ అయ్యెను. ఈ సాయన రవిని కేంద్రముగా భావించుకొని మంద భుజను సాధింపగా, ఈ కేంద్రము మూడు రాసులలోగా నున్నందున, ఇదియే భుజయగును. ఆ భుజ రాశి స్థానమందు ౨ ఉన్నందున పూర్వోక్తములగు ఆది చర ఖండము ౩౬ న్ను మధ్య చర ఖండము ౨౯ ఇవి రెండును కూర్చగా ౬౫ దీనిని భుజ రాశి స్థానమందు నిలిపి, ఆ భుజ భాగ లిప్తావిలిప్తలగు ౧౪-౧౯-౨౭



వీనిని అంత్య చర ఖండమగు ౧౨ చేత ప్రత్యేకముగ గుణించగా ఈ భాగాదులు ౧౬౮-౨౨౮-౩౨౪ వచ్చుచున్నవి. అందు విలిప్తలను ౬౦ చే భాగించగా లబ్ధము ౫ వీనిని లిప్తలగు ౨౨౮ లో కలపగా ౨౩౩ అయినది. వీనిని ౬౦ చే భాగించగా లబ్ధము ౩ వచ్చినది. దీనిని భాగలగు ౧౬౮ లో కలపగా ౧౭౧ వచ్చినది. వీనిని ౩౦ చే భాగించగా లబ్ధము ౫ వచ్చినది. దీనిని రాశిస్థానమందుండు చరఖండయోగమగు ౬౫ లో కలపగా ౭౦ వచ్చినది. ఇవి విఘడియలగును. వీనిని ౬౦ చే భాగించగా లబ్ధము ఘడియలు ౧ విఘడియలు ౧౦ అయినవి. సాయన రవి ౬ రాసులలోగా ( మేషాది షట్కమం దున్నందున ) ఈ ఘడియా విఘడియలు సౌమ్యములు గనుక, లంకాదినార్ధమగు ౧౫ లో కలపగా ౧౬-౧౦ ఇదియే దినార్ధమగును. దీనిని ౨ చే గుణించగా ౩౨-౨౦ ఇదియే అహఃప్రమాణమగును. దీనిని ౬౦ లో తివచగా ౨౭-౪౦ ఇదియే రాత్రి ప్రిమాణమగును.

## తిథి సాధనము.

శ్లో॥ వ్యర్కేందులిప్తాభక్తాస్స్యుస్తిథయోఖాశ్విపర్వతైః ।
గతగమ్యాశ్చషష్టిఘ్నాః నాడ్యోభుక్త్యంతరోద్ధృతాః ॥

టీ॥ వ్యర్కేందులిప్తాః = వ్యర్కేందు = సూర్యుడు తివచబడిన చంద్రుని యొక్క, లిప్తాః = లిప్తలను, ఖాశ్విపర్వతైః = ( ఖ - ౦, అశ్వి - ౨, పర్వతైః - ౭, ) ౭౨౦ చేత, భక్తాః = భాగింపబడుచుండగ నేర్పడిన లబ్ధము, తిథయః = గత తిథులగును. గతగమ్యాశ్చ = ఆ శేషమువల్ల యేర్పడెడి గత ఏష్య లిప్తలు, షష్టిఘ్నాః = ౬౦ చేత గుణింపబడుచు, భుక్త్యంతరోద్ధృతాః = భుక్త్యంతర = వ్యర్కేందు గతి చేత, ( అనగా రవిగతి తివచబడిన చంద్రిగతిచేత ననుట. ) ఉద్ధృతాః = భాగింపబడుచుండగా నేర్పడిన లబ్ధము, నాడ్యః = మధ్యాహ్నమునకు గత ఏష్యములను తిథి ఘడియలగును.

తా॥ స్ఫుట సూర్యుని స్ఫుట చంద్రునిలో తివచగ మిగిలినది ( వ్యర్కేందు ననబడును. ) సూర్య స్ఫుటగతిని చంద్రిస్ఫుటగతిలో తివచగ మిగిలినది ( వ్యర్కేం

దు గతి యనఁబడును.) వ్యర్కేందు రాసులను ౩౦ చే గుణించి, క్రింది భాగలు కలుపుకొని, దానిని ౬౦ చె గుణించి క్రింది లిప్తలు కలుపుకొనగా, వ్యర్కేందు లిప్తలగును. ఈ లిప్తలు ౭౨౦ చె భాగించగ లబ్ధము గత తిథులగును. ఆ శేషము సాధారణముగ ౧౮౦ టికి తక్కువైనయెడల గతమనియు, యెక్కువైనయెడల ఏష్యమనియు, నెఱుంగవలయు. కొన్ని సమయములయందు శేషము ౧౮౦ కి తక్కువైనను ఏష్యమగుటకలదు. యీ గతఏష్యజ్ఞానోపాయము పూర్వ తిథులవలన నెఱుంగవలయును. ఇట్లు గత ఏష్యములను నిశ్చయించుకొని, తిథి ఏష్యముగ రావలసినయెడల ఆ శేష లిప్తావిలిప్తలను ౭౨౦ లిప్తలలో తివచగ మిగిలినవి, ఏష్య తిథి లిప్తావిలిప్తలగును. తిథి గతమయినయెడల ౧౮౦ టికి తక్కువ ఆ శేషమే గత లిప్తావిలిప్తలగును. వీనిని ౭౨౦ లో తివచకూడదు. ఇట్టి గతఏష్య లిప్తావిలిప్తలను ౬౦ చే గుణించి వ్యర్కేందు గతిచేత భాగించగా లబ్ధము ఘడియలగును. ఆ శేషమును ౬౦ చె గుణించి మఱల భాగించగ లబ్ధము విఘడియలగును. ఈ ఘడియా విఘడియలు ఏష్యమైనయెడల దినార్ధములో కలపగా సూర్యోదయాది ఏష్య తిథి ఘటికలగును. గతమైనయెడల ఆ లబ్ధ ఘడియా విఘడియలను దినార్ధములో తివచగ సూర్యోదయాది గత తిథి ఘడియలగుననుటు వ్యర్కేందుగతిని ౬౦చె గుణించి సవరించుకొనినయెడల పూర్వోక్తములగు (౬౦ చె గుణింపబడిన గతఏష్య లిప్తావిలిప్తలను) మఱల ౬౦ చె గుణించవలెను.

## ఉదహరణము.

రాశ్యాది స్ఫుట చంద్రుడు ౩-౪-౪౮-౨౬ గతి ౭౭౨-౧౮ ఇందులో రాశ్యాదిస్ఫుటరవి ౧-౨౩-౫౮-౦ గతి ౫౭-౫ దీనిని తివచగ రాశ్యాది వ్యర్కేందు. ౧-౧౦-౫౦-౨౬ వ్యర్కేందు గతి ౭౧౫-౧౩ వచ్చినది. వ్యర్కేందు రాసులను ౩౦ చె గుణించి క్రింది భాగలు కలుపుకొని దానిని ౬౦ చె గుణించి క్రింది లిప్తలు కలపగా ౨౪౫౦ లిప్తలు అయినవి. వీనిని ౭౨౦ చె భాగించగ లబ్ధము గత తిథులు ౩ ఆ శేషము లిప్తలు ౨౯౦ క్రింది లిప్తలు ౨౬ ఇవి ౧౮౦ కంటె యెక్కువైనందున ఏష్యతిథ్యాత్మకములు గనుక, ఆ లిప్తావిలిప్తలను ౭౨౦ లిప్తలలో తివచగ మిగిలిన ఏష్యతిథిలిప్తావిలిప్తలు ౪౨౯-౩౪ వీనిని ౬౦ చె గుణించి మానమెత్తగా ౨౫౭౭౪



అయినవి. వీనిని వ్యర్కేందు గతి లిప్తలగు ౭౧౫-౧౩ చె భాగించవలెను. గనుక ౭౧౫ ను ౬౦ చె గుణించి క్రింది విలిప్తలను కలుపగా ౪౨౯౧౩ అయినవి పూర్వోక్తములగు ౨౫౭౭౪ ను మఱల ౬౦ చె గుణించి సజాతీయము చేసికొనగా ౧౫౪౬౪౪౦ అయినవి. వీనిని పూర్వోక్త గతి సంఖ్యయగు ౪౨౯౧౩ చె భాగించగ లబ్ధము ఘడియలు ౩౬ ఆ శేషమగు ౧౫౭౨ ను ౬౦ చె గుణించి మఱల భాగించగ లబ్ధము విఘడియలు ౨ ఈ లబ్ధ ఘడియా విఘడియలగు ౩౬-౨ను దినార్ధమగు ౧౬-౧౦ లో కలపగా సూర్యోదయాది చతుర్థీ తిథి ఘడియలు ౫౨-౧౨ అయినవి. ఇదే తిథి సాధనమని తెలియవలెను.

## నక్షత్ర సాధనము.

శ్లో॥ చంద్రలిప్తాః ఖఖాష్టాప్తాః నక్షత్రాణి గతానిచ ।
గతగమ్యాశ్చ షష్టిఘ్నాః శశిభుక్త్యా విభాజితాః ॥

టీ॥ చంద్రలిప్తాః - చంద్రుని లిప్తలు, ఖఖాష్టాప్తాః - ( ఖ - ౦, ఖ - ౦, అష్ట - ౮, ) - ౮౦౦, వీనిచె భాగింపబడగ నేర్పడిన లబ్ధము, గతాని - గడచిన నక్షత్రాణి - నక్షత్రములగును, గతగమ్యాశ్చ - ఆ శేషమువల్ల యేర్పడెడి గత ఏష్య లిప్తావిలిప్తలు, షష్టిఘ్నాః - ౬౦ చె గుణింపఁబడుచు, శశిభుక్త్యా - చంద్రు స్ఫుట గతిచెత, విభాజితాః - భాగింపబడగ నేర్పడిన లబ్ధము మధ్యాహ్నమునకు గతఏష్య నక్షత్ర ఘడియలగును.

తా॥ స్ఫుట చంద్రుని రాసులను ౩౦ చె గుణించి క్రింది భాగలు కలుపుకొని దానిని ౬౦ చె గుణించి క్రింది లిప్తలు కలపగ చంద్ర లిప్తలగును. వీనిని ౮౦౦ చె భాగించగ వచ్చిన లబ్ధము గత నక్షత్రములగును. ఆ శేషము ౪౦౦ కి తక్కువైనయెడల గతమనియు, యెక్కువైనయెడల ఏష్యమనియు, నిట్లు సాధారణముగ నెఱుంగవలెను. కొన్ని సమయములయందు శేషము ౪౦౦ కి తక్కువైనను ఏష్యమగుట కలదు. గనుక పూర్వ నక్షత్రముల వలన పూర్వోక్త క్రమంబుగ గత ఏష్యముల నెఱింగి ఏష్య నక్షత్రము రావలసినయెడల ఆ శేష లిప్తావిలిప్తలను (౮౦౦) లో తివచగ మిగిలినవి మధ్యాహ్నమునకు పైన ఏష్య నక్షత్ర లిప్తావిలిప్త, లగును. నక్షత్రము గతమైనయెడల ౪౦౦ కి తక్కువగు ఆ శేషమే మధ్యాహ్నమునకు గత నక్షత్ర లిప్తావిలిప్తలగును. వీనిని (౮౦౦) లో తివచకూడదు. ఇట్లు

యేర్పడిన గత ఏష్య నక్షత్ర లిప్తావిలిప్తలను ౬౦ చె గుణించి చంద్ర స్ఫుట గతిచే భాగించగ వచ్చిన లబ్ధము ఘడియలగును. ఆ శేషమును ౬౦ చె గుణించి మఱల భాగించగ వచ్చిన లబ్ధము విఘడియలగును. ఈ లబ్ధ ఘడియా విఘడియలు ఏష్య నక్షత్రాత్మకములైన యెడల దినార్ధములో కలపగ సూర్యోదయాది ఏష్య నక్షత్ర ఘడియలగును. గత నక్షత్రాత్మకములైనయెడల ఆ లబ్ధ ఘడియావిఘడియలను దినార్ధములో తీవచగ సూర్యోదయాది గత నక్షత్ర ఘడియలగుననుట.

చంద్ర గతియందు విలిప్త లున్నప్పుడు ౬౦ చె గుణించి సవరించుకొనిన యెడల పూర్వోక్తములగు (౬౦ చె గుణింపబడిన గత ఏష్య నక్షత్ర లిప్తావిలిప్తల నున్న) మఱల ౬౦ చె గుణించి సజాతీయము జేసికొనవలెను.

## ఉదహరణము.

రాశ్యాది స్ఫుట చంద్రుడు ౩-౪-౪౮-౨౬ గతి - ౭౭౨-౧౮ ఈ స్ఫుట చంద్ర రాసులను ౩౦ చె గుణించి క్రిందిభాగలను కలుపుకొని దానిని ౬౦ చె గుణించి క్రింది లిప్తలు కలపగ ౫౬౮౮ చంద్రలిప్తలాయెను. వీనిని (౮౦౦) చె భాగించగ లబ్ధము గతనక్షత్రములు ౭, ఆ శేష లిప్తలు ౮౮ క్రింది విలిప్తలు ౨౬ ఇవి ౨౦౦ కంటె తక్కువైనందున గత నక్షత్ర లిప్తావిలిప్తలనఁబడును. వీనిని ౬౦ చె గుణించి మామెత్తగా ౫౩౦౬ అయినది. దీనిని చంద్రగతియగు ౭౭౨-౧౮ చె భాగించవలెను. గనుక చంద్రగతి లిప్తలను ౬౦ చె గుణించి క్రింది విలిప్తలు గలుపుకొనగా ౪౬౩౩౮ అయినది. పూర్వోక్తములగు ౬౦ చె గుణింపఁబడిన గత నక్షత్ర లిప్తలను మఱల ౬౦ చే గుణించి సజాతీయము జేసికొనగా ౩౧౮౩౬౦ దీనిని పూర్వోక్త గతి సంఖ్యాకమగు ౪౬౩౩౮ చే భాగించగా లబ్ధము ఘడియలు ౬ ఆ శేషమగు (౪౦౩౩౨) ను ౬౦ చే గుణించి మఱల భాగించగా లబ్ధము విఘడియలు ౫౨ ఈ గత నక్షత్ర ఘడియా విఘడియలగు ౬-౫౨ ను దినార్ధమగు ౧౬-౧౦ లో తీవచగా సూర్యోదయాది పునర్వసూ నక్షత్ర ఘడియలు ౯-౧౮ అని యిట్లు తెలియవలెను. నక్షత్రాంత్యము నెఱుంగుటకై మరు దినము పుష్యమీ నక్షత్ర మెన్ని గడియలున్నదియో గణించుకొనవలెను. అది యెట్లనిన రవి భుజా ఫల భాగ సంస్కారముచేయుని మధ్య రవి చంద్రులలో వారి వారి మధ్యగతులను కలపగా మరుదినపు మధ్యాహ్న మధ్య గ్రహంబులగును. ఆ మధ్య రవిని పూర్వోక్త



ప్రకారము స్ఫుటముజేసి రవి భుజా ఫలము నెఱింగి ఆ భుజా ఫల భాగమును చంద్రునకు రవికివలెనే ధన ఋణము లెరిగి సంస్కరించి తదనంతరము చంద్రుని స్ఫుటముజేసికొని పూర్వోక్త ప్రకారము గత ఏష్యముల నెఱింగి మరు దిన మందుండు నక్షత్రము నెరుంగవలెను. నక్షత్రమువలెనే యోగమును గ్రహించవలెనని తాత్పర్యము.

## యోగసాధనము.

శ్లో॥ రవీందోర్యోగలిప్తాస్యు ర్యోగాఃఖఖగజైహృతాః।
గతగమ్యాశ్చషష్టిఘ్నాః భుక్తియోగవిభాజితాః॥

టీ॥ రవీందోః = సూర్య చంద్రులయొక్క, యోగలిప్తాః = కూడికవల్ల నేర్పడిన లిప్తలు, ఖఖగజైః = (ఖ - ౦, ఖ - ౦, గజైః - ౮,) - ౮౦౦ చే హృతాః = భాగింపబడగా నేర్పడిన లబ్ధము, యోగాః = విష్కంభాది గతయోగములు, స్యుః = అగుచున్నవి, గతగమ్యాశ్చ = ఆ శేషములవల్ల నేర్పడెడి, గత ఏష్య లిప్తావిలిప్తలు, షష్టిఘ్నాః = ౬౦ చే, గుణింపబడుచు, భుక్తియోగ విభాజితాః = భుక్తియోగ = రవి చంద్రస్ఫుటగతుల కూడికచేత, విభాజితాః = భాగింపబడుచుండి నేర్పడిన లబ్ధము గత ఏష్య యోగ ఘడియలగును.

తా॥ రాశ్యాది స్ఫుట రవి చంద్రులను కలిపి లిప్తలుచేసికొని (౮౦౦) చే భాగించగా వచ్చిన లబ్ధము విష్కంభాదిగా గతించిన యోగసంఖ్యయగును. ఆ శేషమువల్ల నక్షత్రమువలెనే గతఏష్య లిప్తలు యేర్పరచుకొని వానిని ౬౦ చే గుణించి రవి చంద్ర స్ఫుట గతులను కలిపి భాగించగా వచ్చిన లబ్ధము గతఏష్య యోగ ఘడియలగును. యీ ఘడియా విఘడియలను ఋణ ధనము లెరిగి దినార్ధలో సంస్కరించగా సూర్యోదయాది యోగఘడియగునని తాత్పర్యము.

## కరణసాధనక్రమము.

శ్లో॥ వ్యర్కేందులిప్తాశ్శూన్యాంగ రామభక్తఫలంతుయత్।
తస్మిన్నేకవిహీనంచే త్బవాదికరణంభవేత్॥

టీ॥ వ్యర్కేందు లిప్తాః = రవి తీవచబడిన చంద్రుని లిప్తలు, శూన్యాంగ

రామభక్తఫలంతు = ( శూన్య = ౦, అంగ - ౬, రామ - 3, ) - 3౬౦, వీనిచేత భక్త - భాగింపబడగా నేర్పబడిన, ఫలంతు = లబ్ధము, యత్ =యేది కలదో, తస్మిన్ = దానియందు, ఏకవిహీనంచేత్ = ఒకటి తీసివేసినయెడల, సది, బవాదికరణం = బవాది కరణ సంఖ్య, భవేత్ = అగును.

తా॥ స్ఫుట చంద్రునిలో స్ఫుట రవిని తీవచగా, ( వ్యర్కేందువగును ) ఆ రాశ్యాది వ్యర్కేందువును లిప్తలు చేసికొని, ఆ లిప్తలను 3౬౦ చే భాగించగా వచ్చిన లబ్ధమందు దొకటి తీవచగా మిగిలినది బవాదికరణంబగును.

మఱియొక విధ మెట్లనిన.

శ్లో॥ తిథేర్ద్విగుణమేకోనం స్యాద్బవాదికమన్వహం ।
వ్యర్కేందుగత్యాసంసాధ్యాః ఘటికాస్తుతిథేర్యథా ॥

టీ॥ ఏకోనం = ఒకటి తీవచబడిన, తిథేః = తిథియొక్క, ద్విగుణం = రెట్టింపు ( అనఁగా గత తిథుల సంఖ్యను రెంటగుణించి అందులో నొకటి తీవచవలెననుట, ) అన్వహం = ఎల్లప్పుడును, బవాదికం = బవాదికరణ సంఖ్య, స్యాత్ - అగును, ఘటికాస్తు - ఘడియలో, తిథేర్యథా - తిథికివలెనే, వ్యర్కేందుగత్యా - రవి స్ఫుట గతి తీవచబడిన, చంద్రు స్ఫుట గతిచేత, సంసాధ్యాః - సాధింపఁదగినవి.

తా॥ గత తిథులసంఖ్యను రెంటిచేతగుణించి అందులో నొకటి తీవచగా మిగిలినది బవాదికరణ సంఖ్యయగును. చంద్రు స్ఫుట తిలో రవి స్ఫుట గతిని తీవిచి శేషించిన ( వ్యర్కేందు గతిచేత ) తిథికివలెనే కరణ ఘడియలను సాధింపవలెనని తాత్పర్యము.

శ్లో॥ అహఃప్రమాణతోన్యూనా స్తిథేర్నాడీ వినాడికాః ।
యదితా ఏవ తిథ్యర్థనాడికా స్సంభవంతి హి ॥

టీ॥ తిథేః = తిథియొక్క, నాడీవినాడికాః = ఘడియా విఘడియలు, అహ ప్రమాణతః = అహ ప్రమాణముకంటె, న్యూనాయది = తక్కువయినప్పుడు, తాఏవతిథ్యర్థనాడికాః = ఆ తిథ్యర్థఘటికలే, సంభవంతి = కరణ ఘడియలు అగుచున్నవి.



తా॥ తిథియొక్క ఘటికావిఘటికలు అహప్రమాణముకంటె తక్కువైనప్పుడు ఆతిథ్యర్థఘటికలే కరణ ఘటికలగుననుట.

చరస్థిరాది కరణ నిర్ణయము.

శ్లో॥ బవశ్చబాల వశ్చేతి కౌలవో తైతుల స్తతః ।
గరజశ్చవణిగ్భద్ర స్సప్తైతానిచరాణివై ॥

టీ॥ బవశ్చ - బవయు, బాలవశ్చ - బాలవయు, కౌలవః - కౌలవయు, తైతులః - తైతులయు, తతః - అనంతరము, గరజశ్చ - గరజియు, వణిక్ - వనజియు, భద్రశ్చేతి - భద్రయనెడి, సప్తైతాని - ఈ యేడు కరణంబులును, చరాణి - చర సంజ్ఞగలవి యగును.

శ్లో॥ కరణాన్యథకృష్ణేతు చతుర్దశ్యుత్తరేదళే ।
శకునీదర్శపూర్వార్థే చతుష్పాదుత్తరేదళే ॥
నాగవస్స్యాచ్ఛుక్లపక్షే కింతుఘ్నః ప్రతిపద్యతః ।
స్థిరాణికరణాన్యేవం సంభవంతి తిథిక్రమాత్ ॥

టీ॥ అథ - అనంతరము, కరణాని - శేషించినవి నాలుగు కరణంబులు అందు, కృష్ణేతు - కృష్ణపక్షంబున, చతుర్దశ్యుత్తరేదళే - చతుర్దశీ ఉత్తరార్థమందు, శకునీ - శకునికరణంబును, దర్శపూర్వార్థే - అమావాస్యయొక్క పూర్వార్థమందు, చతుష్పాత్ - చతుష్పాత్తనెడి కరణంబును, ఉత్తరేదళే - అమావాస్యయొక్క ఉత్త రార్థమందు, నాగవః - నాగవకరణంబును, శుక్లపక్షే - శుక్లపక్షంబున, ప్రతిపది - పాడ్యమీ పూర్వభాగమందు, కింతుఘ్నః - కింతుఘ్నమనెడి కరణంబును, స్యాత్ - అగును. అతః - ఆ హేతువుచేత, కరణాని - ఈ నాలుగు కరణంబులును, స్థిరాణి - స్థిరసంజ్ఞగలవియగును. ఏవం - ఈ ప్రకారము, తిథిక్రమాత్ - పైచెప్పఁబడిన తిథి క్రమంబున, సంభవంతి - కలుగుచున్నవి.

తా॥ బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వనజి, భద్ర, అను నీ యేడుకరణం బులును, ( చరములు అనఁబడును ) మఱియు కృష్ణపక్షపు చతుర్దశీ ఉత్తరార్థమందు శకునియు, అమావాస్యా పూర్వార్థమందు చతుష్పాత్తును అమావాస్యా ఉత్తరార్థ

మందు నాగవంబును శుక్లపాడ్యమీ పూర్వార్ధమందు కింతుఘ్నంబును ఇట్లు తిథిక్రమమున రాబడును. కనుక ఇవి నాలుగును ( స్థిరములు ) అని చెప్పఁబడును.

శ్లో॥ శుక్లాష్టమ్యాంపూర్ణిమాయాం విష్టిఃపూర్వదళేభవేత్ ।
దినస్యైకస్యకరణ ద్వయ మేవేతిచింతయేత్ ॥

టీ॥ శుక్లాష్టమ్యాం - శుక్లపక్షపు అష్టమియందును, పూర్ణిమాయాం - పున్నమయందును, పూర్వదళే - పూర్వార్ధమున, విష్టిః - భద్రకరణమును, భవేత్ - అగును. ( అనగా వచ్చుననుట. ) దినస్యైకస్య - ఒక దినమునకు, కరణద్వయమేవేతి - రెండు కరణములని, చింతయేత్ - యోచించవలెను.

తా॥ శుక్లపక్షపు అష్టమియందును పున్నమయందును పూర్వార్ధమున భద్రవా కరణము వచ్చును. ఒక దినమునకు రెండు కరణములని తెలియవలెను.

[ ఈ తిథి కరణ చక్రము ౬ వ పుటలో జేర్చినాను చూడగలరు. ]

## విష ( త్యాజ్య ) ఘటికా సాధన క్రమము.

శ్లో॥ విషధ్రువఃఖఖాష్టఘ్నః శ్శశిభుక్తిహృతఃఫలం ।
నాడ్యాదికంతుపూర్వర్క్షే యోజయేద్విషనాడికాః ॥

టీ॥ విషధ్రువః - ఆ యా నక్షత్రి విషధ్రువ సంఖ్య, ఖఖాష్టఘ్నః - ( ఖ - ౦, ఖ - ౦, అష్ట - ౮, ) - ౮౦౦ చే గుణింపఁబడినదై, శశిభుక్తిహృతః - శశిభుక్తి, చంద్ర స్ఫుట గతిచేత, హృతః - భాగింపబడగా నేర్పడిన, ఫలం - లబ్ధముగు - నాడ్యాదికం - ఘుడియా విఘుడియలను, పూర్వర్క్షే - పూర్వ నక్షత్రమందు, యోజయేత్ - కూడవలెను. ఇట్లు చేయ, విషనాడీఘటికాః - విష ఘుడియలగును.

తా॥ ఈ క్రింద చెప్పబోయ్యెడి ఆ నక్షత్ర విషధ్రువ సంఖ్యను ౮౦౦ చే గుణించి చంద్ర స్ఫుటగతిచే భాగించగా లబ్ధము ఘుడియలగును. ఆ శేషము ౬౦ చే గుణించి మఱల చంద్ర స్ఫుటగతిచే భాగించగా లబ్ధము విఘుడియలగును. ఈ ఘుడియా విఘుడియలను పూర్వ నక్షత్రమందు కలుపగా విఘుడియలగును. అనఁగా త్యాజ్య ప్రారంభ కాల మగుననుట.



## అశ్విన్యాది విషధ్రువ క్రమము.

శ్లో॥ దస్రాది భక్రమత ఏవవిషధ్రువాస్స్యు ర్వ్యోమేషు వేదకర
శూన్యగుణాభ్రవేదైః । వేదోర్వరేందు కరశూన్య గుణాభ్ర
హస్తనేత్రాగ్ని పుష్కరగుణాభ్ర కరాహిచంద్రైః॥

టీ॥ దస్రాదిభక్రమతఏవ - అశ్వినీ నక్షత్ర క్రమంబుగానే, విషధ్రువాః - చెప్పబోయ్యెడి విషఘటికాధ్రువములు, స్యుః - కాగలవు. ఎట్లనిన - వ్యోమేషు వేదకర శూన్యగుణాభ్ర వేదైః - ( వ్యోమ - ౦, ఇషు - ౫ ) - ౫౦, ( వేద - ౪, కర - ౨, ) - ౨౪, ( శూన్యం - ౦, గుణ - ౩, ) - ౩౦, ( అభ్ర - ౦, వేదైః - ౪,) - ౪౦, వీనిచేతను, వేదోర్వరేందు కర శూన్య గుణాభ్రహస్త నేత్రాగ్ని పుష్కర గుణాభ్రికరాహిచంద్రైః - ( వేద - ౪, ఉర్వరా - ౧, ). - ౧౪, ( ఇందు - ౧, కర - ౨, ) - ౨౧, ( శూన్య - ౦, గుణ - ౩, ) - ౩౦, ( అభ్రి - ౦, హస్త - ౨ ) - ౨౦, ( నేత్ర - ౨, అగ్ని - ౩, ) - ౩౨, ( పుష్కర - ౦, గుణ - ౩, ) - ౩౦ ( అభ్రి - ౦, కర - ౨, ) - ౨౦, ( అహి - ౮, చంద్రైః - ౧, ) - ౧౮, వీనిచేతను.

శ్లో॥ చంద్రాక్షిపుష్కరకరాబ్ధి ధరాబ్ధిచంద్రైశ్శూన్యేందు వేద
వసుధారససాయకైశ్చ । వేదాక్షిశూన్యభుజ దిగ్దశనాగచం
ద్రైస్తర్కేందువేదభుజ పుష్కరవహ్నిభిశ్చ ॥

టీ॥ చంద్రాక్షిపుష్కరకరాబ్ధి ధరాబ్ధిచంద్రైః - [ చంద్ర - ౧, అక్షి - ౨,] - ౨౧, [ పుష్కర - ౦, కర - ౨, ] - ౨౦, [ అబ్ధి - ౪, ధరా - ౧, ] - ౧౪, [ అబ్ధి - ౪, చంద్రైః - ౧, ] - ౧౪, వీనిచేత, శూన్యేందువేదవసుధా రససాయకైశ్చ - [ శూన్య - ౦, ఇందు - ౧, ] - ౧౦, [ వేద - ౪, వసుధా - ౧, ] - ౧౪, [ రస - ౬, సాయకైశ్చ - ౫, ] - ౫౬, వీనిచేతను, వేదాక్షిశూన్యభుజది గ్దశనాగచంద్రైః - [ వేద - ౪, అక్షి - ౨, ] - ౨౪, [ శూన్య - ౦, భుజ - ౨, ] = ౨౦, దిక్ - ౧౦, దశ - ౧౦, [ నాగ - ౮, చంద్రైః - ౧, ] - ౧౮, వీనిచెతను, తర్కేందు వేద భుజ పుష్కరవహ్నిభిశ్చ - [ తర్క - ౬, ఇందు - ౧, ] - ౧౬, [ వేద - ౪, భుజ - ౨, ] - ౨౪, [ పుష్కర - ౦, వహ్నిభిశ్చ - ౩, ] - ౩౦, వీనిచేతను, అశ్వనీనక్షత్ర క్రమముగా, విషధ్రువంబులగునని పూర్వశ్లోకార్థములతో నన్వయము.

తా॥ నక్షత్రముల విషధ్రువ సంఖ్యలు యీ క్రింద వ్రాయబడుచున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వినికి | ౫౦ | మఘకు | ౩౦ | మూలకు | ౫౬ |
| భరణికి | ౨౪ | పూఫకి | ౨౦ | పూర్వాషాఢకు | ౨౪ |
| కృత్తికకు | ౩౦ | ఉఫకి | ౧౮ | ఉత్తరాషాఢకు | ౨౦ |
| రోహిణికి | ౪౦ | హస్తకు | ౨౧ | శ్రవణముకు | ౧౦ |
| మృగశిర్షముకు | ౧౪ | చిత్రకు | ౨౦ | ధనిష్టకు | ౧౦ |
| ఆర్ద్రకు | ౨౧ | స్వాతికి | ౧౪ | శతభిషమునకు | ౧౮ |
| పునర్వసుకు | ౩౦ | విశాఖకు | ౧౪ | పూర్వాభాద్రకు | ౧౬ |
| పుష్యమికి | ౨౦ | అనూరాధకు | ౧౦ | ఉత్తరాభాద్రకు | ౨౪ |
| ఆశ్లేషకు | ౩౨ | జ్యేష్ఠకు | ౧౪ | రేవతికి | ౩౦ |

నక్షత్ర ధ్రువ సంఖ్యచేత పూర్వోక్త ప్రకారము విషఘటికా ప్రారంభ కాలమును సాధించవలెననుట.

## అమృత ధ్రువనిర్ణయము.

శ్లో॥ అశ్వినీ విషధ్రువోష్టహీనతో ఽమృతధ్రువస్స్యాద్విధేర్ధ్రువ
వస్తు సర్వదార్కసంయుతో భవేత్ । ఆసురేర్కశోధితేఖిలేషు
శేషభేషువై సంభవంతి వేదబాహుసంయుతేషుతద్ధ్రువాః॥

టీ॥ అశ్వినీవిషధ్రువః - అశ్వినీ విషధృవము, అష్టహీనతః - ౮ చే తగ్గినదగుచు, అమృతధ్రువః - అమృత ధ్రువము, స్యాత్ - అగును, విధేర్ధ్రువః రోహిణీ విషధ్రువము, సర్వదా - ఎల్లప్పుడును, అర్కసంయుతః - ౧౨ తో చేరినదై, భవేత్ - అమృతధ్రువంబగును, అర్కశోధితే - ౧౨ ను తీవచబడిన, ఆసురే - మూలానక్షత్ర విషధ్రువము, అమృతధ్రువంబగును, అఖిలేషు - సకలములైన, శేషభేషు - మిగిలిన నక్షత్ర విష ధ్రువంబులు, వేదబాహుసంయుతేషు - ( వేద - ౪, బాహు - ౨, ) - ౨౪ తో, సంయుతేషు - కలియుచు, తద్ధ్రువాః - అమృత ధ్రువంబులు, సంభవంతి - అగుచున్నవి.

తా॥ అశ్వినీ విష ధ్రువములో ౮ తీవచగా, దాని అమృతధ్రువంబగును. రోహిణీ విషధ్రువములో ౧౨ చేర్చగా, దాని అమృత ధ్రువంబగును. మూలా నక్షత్రి విషధ్రువములో ౧౨ తీవచగా, దాని అమృత ధ్రువంబగును. మిగిలిన నక్షత్ర ధ్రువంబులకు ౨౪ తో ప్రత్యేకముగ గూడినవై, వానివాని అమృత ధ్రువంబులగునని తాత్పర్యము.



## అమృతధ్రువములచే అమృతాదులం దెచ్చు క్రమము.

శ్లో॥ ఋక్షాద్యంత ఘటీమానం నక్షత్రధ్రువ తాడితం ।
షష్ట్యాప్తం పూర్వనక్షత్రే సంయోగా దమృతాదయః ॥

టీ॥ ఋక్షాద్యంతఘటీమానం = నక్షత్రాద్యంత ఘటికా ప్రమాణము, నక్షత్రధ్రువతాడితం = ఆ యా నక్షత్ర ధ్రువముచేత గుణింపబడుచు, షష్ట్యాప్తం = (౬౦) చే భాగింపబడగా నేర్పడిన లబ్ధ ఘడియా విఘడియలను, పూర్వ నక్షత్రే = పూర్వ నక్షత్రమందు, సంయోగాత్ = కలుపుటవలన, అమృతాదయః = అమృతాది ఘడియలగును.

తా॥ ఆ యా నక్షత్రాద్యంత ఘడియలను, ఆ యా నక్షత్ర ధ్రువములచేత గుణించి ౬౦ చే భాగించిన లబ్ధము ఘడియలును, ఆ శేషము విఘడియలునగును. ఈ లబ్ధ ఘడియా విఘడియలను, పూర్వ నక్షత్ర ఘడియల యందుజేర్చగా, అమృతాది ఘడియలగునని తా॥

## త్యాజ్య పరిమాణ నిర్ణయము.

శ్లో॥ నక్షత్రాద్యంత తిథ్యంశం త్యాజ్యమానం భవేదిదం।
రాత్రిత్యాజ్య ఘటీయుక్తం రాత్రిమానాదికం యది ॥

టీ॥ నక్షత్రాద్యంత తిథ్యంశం = నక్షత్రాద్యంత = నక్షత్రాద్యంతఘడియలయొక్క తిథ్యంశం = ౧౫ వ భాగము, త్యాజ్యకాల ప్రమాణము, భవేత్ = అగును. ఇదం = ఇది, రాత్రి త్యాజ్యఘటీయుక్తం = రాత్రి కాల త్యాజ్య ప్రారంభ ఘటికాయుక్తమైనదగుచు, రాత్రిమానాదికంయది = రాత్రిమాన = రాత్రి ప్రమాణమునకంటె, అధికంయది = అధికమైనయెడల,

శ్లో॥ తన్మానేన విహీనంత చ్ఛేషత్యాజ్య మితీరితం ।
త్యాజ్యకాలేసమస్తాని శుభకర్మాణి వర్జయేత్ ॥

టీ॥ తత్ = అది, తన్మానేన = రాత్రి ప్రమాణముచేత, విహీనం = తగ్గినదగుచు, శేషత్యాజ్యమితి = శేషత్యాజ్యమని, ఈరితం = చెప్పబడెను. త్యాజ్య

కాలే = వర్జకాలమందు, సమస్తాని = సమస్తములయిన, శుభకర్మాణి = శుభకర్మములను, వర్జయేత్ = విడువవలెను. అనఁగా చేయకూడదనుట.

తా॥ నక్షత్ర ఆద్యంత ఘడియలయొక్క ౧౫ వ భాగము త్యాజ్య కాల ప్రమాణమగును. ఆత్యాజ్య పరిమాణము, రాత్రి కాల త్యాజ్య ప్రారంభ ఘటికా యుక్తమైన దగుచు, రాత్రి కాల ప్రమాణముకంటే అధికమైనయెడల, నప్పుడు, దానిలో రాత్రి కాలప్రమాణమును తీవచగా మిగిలిన ఘడియావిఘయలు, శేష త్యాజ్య ఘడియలగును. త్యాజ్యకాలమందు, యే శుభకర్మములును జరుపకూడదని తా॥

తిథి నక్షత్రములకు ఏష్యఘటికలు చెప్పు విధము.

శ్లో॥ ఖతర్కాస్తిథినక్షత్ర పరిమాణ కలాహతః।
తయోర్గత్యా విభక్తశ్చే దేష్యనాడీ వినాడికాః॥

టీ॥ తిథి నక్షత్ర పరిమాణకలాహతః = తిథి నక్షత్ర పరిమాణకలా = తిథి నక్షత్రములయొక్క ప్రమాణ లిప్తలచేత, హతః = గుణింపఁబడిన, ఖతర్కాః = ( ఖ - ౦, తర్కాః = ౬, ) = ౬౦, ది, అనఁగా, ( ౬౦ చే గుణింపఁబడిన తిథినక్షత్ర పరిమాణ లిప్తలనుట, ) తయోః = ఆ తిథి నక్షత్ర సంబంధములైన, వ్యర్కేందు చంద్రులయొక్క గత్యా = గతిచేత, విభక్తశ్చేత్ = భాగింపబడినయెడల, ఆ లబ్ధము = ఏష్యనాడివినాడికాః = ఏష్య ఘడియా విఘడియలగును.

తా॥ తిథి నక్షత్ర పరిమాణ లిప్తలను ౬౦ చే గుణించి వాని సంబంధములగు వ్యర్కేందు చంద్ర గతులచే భాగించగా లబ్ధము ఏష్య ఘడియా విఘడియ లగుననుట. ఈ విషయమయి పూర్వము తిథి నక్షత్రములను సాధించునపుడే విశదముగా వ్రాసితిమి. అచ్చట చూడవలెను.

నక్షత్ర పాద ప్రవేశము.

శ్లో॥ గ్రహస్యలిప్తాఃఖఖనాగభక్తాః ఫలంగతర్క్షాణ్యథ శేషలిప్తాః।
ఖశూన్య నాగైర్ద్విశతైశ్చతుశ్శతై శ్శూన్యాభ్రతర్కైర్యది సమ్మితాస్తాః॥

టీ॥ గ్రహస్య = గ్రహముయొక్క, లిప్తాః = లిప్తలు, ఖఖనాగభక్తాః = ( ఖ = ౦, ఖ = ౦, నాగ = ౮, ) ౮౦౦, వీనిచేత, భక్తాః = భాగింపబడగా, ఫలం = లబ్ధము,



గతర్క్షాణి = గత నక్షత్రములగును. అథ = తదనంతరము, శేషలిప్తాః = మిగిలిన లిప్తలు ఖశూన్యనాగైః = ( ఖ = ౦, శూన్య = ౦, నాగైః = ౮, ) = ౮౦౦ తోడను ద్విశతైః = ౨౦౦ తోడను, చతుశ్శతైః - ౪౦౦ తోడను, శూన్యాభ్రతర్కైః = ( శూన్య = ౦, అభ్ర = ౦, తర్కైః = ౬, ) = ౬౦౦ తోడను, సమ్మితాయది = పరిమితిగలవి యైనయెడల, తాః = అవి.

శ్లో॥ ఆద్యద్వితీయాదిపదానిదద్యు ర్గతైష్యలిప్తాఃఖరసైశ్చనిఘ్నాః।
గ్రహస్య భుక్త్యావిహృతాస్తు తాస్స్యు ర్నాడ్యో వినాడ్య శ్చగతైష్యభేదాత్॥

టీ॥ ఆద్యద్వితీయాదిపదాని = ప్రథమ ద్వితీయాదిపాదములను, దద్యుః = ఇచ్చుచున్నవి. ఇట్లుచేయగా, గతైష్యలిప్తాః = గత = తక్కువగునట్టియు, ఏష్య మిగిలినట్టియు, లిప్తాః = లిప్తలు, ఖరసైః = ( ఖ = ౦, రసైః = ౬, ) = ౬౦ చేత, నిఘ్నాః = గుణింపబడినవగుచు, తాః = అవి, గ్రహస్య = గ్రహముయొక్క, భుక్త్యా = స్ఫుట గతిచేత, విహృతాస్తు = భాగింపబడగా నేర్పడిన లబ్ధము, నాడ్యః = ఘడియలును, వినాడ్యశ్చ = విఘడియలును, గతైష్యభేదాత్ = గత ఏష్య భేదముల వల్ల, స్యుః = కాగలవు.

తా॥ ఇష్టకాల గ్రహమును లిప్తలు చేసికొని ( ౮౦౦ ) చే భాగించగా ఆ లబ్ధమువల్ల ఆ గ్రహము అశ్విన్యాదిగా అన్ని నక్షత్రిలు గతించినదని తెలియవలెను. శేషించిన లిప్తలువల్ల ( ౨౦౦ ) లిప్తలకు ఒక నక్షత్ర పాదము వంతున గణించగా యెన్ని యగునో అన్ని నక్షత్రపాదములను ఏష్య నక్షత్రమందు ఆ గ్రహము గతించినదని తెలియవలెను. ఇట్లు నక్షత్ర పాదముల నిర్ణయించుటకు తక్కువైన లిప్తలను ౬౦ చే గుణించి ఆ గ్రహస్ఫుట గతిచే భాగించి ఘడియా విఘయలను సాధించుకొని ఆ ఘడియా విఘడియలను ఇష్ట కాలములో కలపగా యెంతకాలమగునో అంతకాలమునకు ఆ గ్రహము వర్తమాన నక్షత్ర ఏష్య పాద ప్రవేశమగునని తెలియవలెను. మఱియు నక్షత్ర పాద నిర్ణయముచేయగా మిగిలిన లిప్తలను ౬౦ చే గుణించి ఆ గ్రహ స్ఫుట గతిచే భాగించగా యెన్ని ఘడియా విఘడియలగునో ఆ ఘడియా విఘడియలను ఇష్టకాలములో ( తీవచగా ) మిగిలిన కాలము ఆ గ్రహముయొక్క వర్తమాన నక్షత్రపాద ప్రవేశకాలమగునని తా॥

శ్లో॥ తిథినక్షత్రయోగానాం గణితాగతనాడికాః।
దినార్థేవియుతాశ్చైతాః యుతాస్సుర్గత గమ్యతః॥

టీ॥ తిథి నక్షత్రయోగానాం = తిథి నక్షత్రములయొక్క, గణితాగతనాడికాః = గణితమువల్ల వచ్చిన ఘడియలు, దినార్థే = అహరర్థమునందు, గతగమ్యతః = గత ఏష్యములనుబట్టి, వియుతాః = తీవచబడగాను, యుతాః = కూర్చగాను, ఏతాస్సుర్యః = తిథి నక్షత్రయోగ ఘడియలగును.

తా॥ గణితమువల్ల వచ్చిన తిథి నక్షత్రయోగ ఘటియలను గత ఏష్య ప్రకారము దినార్థములో సంస్కరించగా ఆదినమందు తిథి నక్షత్రయోగ ఘడియలగుననుట. ఈ విషయమై పూర్వము తిథి నక్షత్ర సాధనమందు విశదముగా చూడవలెను గతమునకు-దినార్థలో తీవచడము, ఏష్యమునకుదినార్థలోకలపవలెను తాత్పర్యము

## వక్రగ్రహములకు పాద ప్రవేశము.

శ్లో॥ కుజాది పంచగ్రహ వక్రకాలే పూర్వక్రమాద్వ్యత్యయతోంఘ్రయస్స్యుః । యతోవియద్వ్యోమగజైశ్చతుర్థ శ్శతద్వయేన ప్రథమోహిపాదః॥

టీ॥ కుజాదిపంచగ్రహవక్రకాలే = కుజాది పంచ గ్రహ వక్ర సమయమందు, పూర్వ క్రమాత్ = ముందు జెప్పిన క్రమముకంటె, వ్యత్యయః = విపరీతముగను, అంఘ్రయః = నక్షత్ర పాదములు, స్యుః = అగుచున్నవి. యతః = ఏ కారణమున, వియద్వ్యోమగజైః = (వియత్ - ౦, వ్యోమ - ౦, గజైః - ౮,) - ౮౦౦ లిప్తలచేత, చతుర్థః = నాలగవ పాదంబును, శతద్వయేన = (౨౦౦) లిప్తలచేత, ప్రథమః = మొదటిదగు - పాదః - పాదంబును,

శ్లో॥ ద్వితీయపాదస్తు చతుశ్శతేన తృతీయపాదోవియదభ్రతర్కైః।
భవేత్ప్రవేశస్యతతో గతైష్య నాడ్యోదినార్థేపివిలోమ సంస్కృతాః॥

టీ॥ చతుశ్శతేన = ౪౦౦ లిప్తలచేత, ద్వితీయపాదః = రెండవ పాదంబును, వియదభ్రతర్కైః = (వియత్ - ౦, అభ్ర - ౦, తర్కైః - ౬,) - (౬౦౦)



లిప్తలచేత, తృతీయపాదః = మూడవ పాదంబును, ప్రవేశస్య = పాద ప్రవేశమునకు, భవేత్ = అగునో, తతః - ఆ కారణమున, గతైష్యనాడ్యోపి - గత ఏష్య గడియలును, దినార్థే - ఆ అహస్సునందు, విలోమసంస్కృతాః = వ్యత్యయముగ సంస్కరింపదగినవి.

తా। గ్రహము వక్రించినప్పుడు అపసవ్యగతిగలది. గనుక, నాలగవ పాదమునుండి మూడవ పాదమునకును, మూడవ పాదమునుండి రెండవ పాదమున కిట్లు వచ్చుచుండును. ఆ హేతువున ౮౦౦ లిప్తలచేత నాలగవ పాద ప్రవేశంబును, ౬౦౦ లిప్తలచేత మూడవ పాద ప్రవేశంబును, ౪౦౦ లిప్తలచేత రెండవ పాద ప్రవేశంబును, ౨౦౦ లిప్తలచేత ప్రథమ పాద ప్రవేశంబును చూచుకొనవలయును. పూర్వమందు చెప్పిన ప్రకారము పాద ప్రవేశమునకు గత ఏష్య గడియలను సాధించుకొని వ్యత్యయముగ దినార్థములో సంస్కరించగా పాద ప్రవేశ కాల మగునని తాత్పర్యము.

## షడశీతి ముఖ నిర్ణయము.

శ్లో॥ స్ఫుటార్కోద్విస్వభావేషు రాశిష్వేవప్రవేశతః।
షడశీతిముఖైర్వ్యోమ్ని జ్యోతిశ్చక్రే విరాజితే॥

టీ॥ స్ఫుటార్కః = స్ఫుటరవిని, ద్విస్వభావేషు = ద్వి స్వభావములైన, రాశిష్వేవ = రాసులయందే, ప్రవేశతః = ప్రవేశించుటవలన, షడశీతిముఖైః = షడశీతి ముఖములచేత, వ్యోమ్ని = ఆకాశమున, జ్యోతిశ్చక్రే = జ్యోతిశ్చక్రమందు, విరాజితే = ప్రకాశింపుచుండును.

తా॥ స్ఫుట సూర్యుడు ద్వి స్వభావరాసులగు, మిథున కన్యా ధనుర్మీనముల యందు ప్రవేశించి, చెప్పబొయ్యెడి భాగములయందుండి జ్యోతిశ్చక్రమున షడశీతి ముఖము సంభవించునని తాత్పర్యము.

శ్లో॥ గజేభై ర్వేదభూపాలై రంశై స్తర్కాంగబాహుభిః।
కరబాణాగ్నిభిశ్చార్కః షడశీతి ముఖంగతః॥

టీ॥ గజేభైః = (గజ - ౮, ఇభైః - ౮,) - ౮౮, అంశైః - భాగలచేతను, వేదభూపాలైః - (వేద - ౪, భూపాలైః - ౧౬,) - ౧౬౪ భాగలనుచేతను,

తర్కాంగబాహుభిః - ( తర్క - ౬, అంగ - ౬, బాహుభిః - ౨, )- ౨౬౬ భాగల చేతను, కరబాణాగ్నిభిః - ( కర - ౨, బాణ - ౫, అగ్నిభిః - ౩, ) -౩౫౨ భాగల చేతను, అర్కః - సూర్యుడు, షడశీతిముఖం — షడశీతి ముఖత్వమును, గతః — పొందును.

తా॥ సూర్యుడు మిధున రాశియందు, ౧౮ వ భాగయందున్నప్పుడును, కన్యా రాశియందు ౧౪ వ భాగయందున్నప్పుడును, ధనురాశియందు ౨౬ వ భాగ యందున్నప్పుడును, మీనరాశియందు ౨౨ వ భాగయందున్నప్పుడును, షడశీతిముఖము సంభవించునని తాత్పర్యము.

## అయన ప్రవేశము.

శ్లో॥ అయనాంశయుతస్సూర్య స్స్వరాశ్యంశకలాదిభిః ।
కరోత్యజాది రాశీనా మయనాని గతైష్యతః ॥

టీ॥ స్వరాశ్యంశకలాదిభిః - స్వ - తనయొక్క, రాశ్యంశకలాదిభిః - రాశి భాగ లిప్తావిలిప్తలచేత, అయనాంశయుతః — అయనాంశములతోగూడిన, సూర్యః — స్ఫుట సూర్యుడు, అజాదిరాశీనాం - మేషాది రాసులయొక్క, అయనాని - అయన ప్రవేశములను, గతైష్యతః - గత ఏష్యయలనుబట్టి, కరోతి - పొందబడును

తా॥ స్ఫుట సూర్యుడు తన రాశి భాగ లిప్తావిలిప్తలచేత, అయనాంశములతో జేరినవాడై, మేషాదిరాసులయొక్క అయన ప్రదేశములను గత ఏష్యమువలన బొందుచున్నాడని తాత్పర్యము.

శ్లో॥ స్ఫుటసూర్యేణసామ్యత్వం షడశీతిముఖస్యహి ।
సాయనార్కేణసామ్యత్వ మయనానాం విచింతయేత్ ॥

టీ॥ షడశీతిముఖస్య - షడశీతి ముఖత్వమునకు, స్ఫుట సూర్యేణ - స్ఫుట సూర్యునితోటి, సామ్యత్వం - సమత్వంబును, అయనానాం - మేషాది అయన ప్రవేశములకు, సాయనార్కేణ - సాయన రవితోటి, సామ్యత్వం - సమత్వంబునున్నూ, విచింతయేత్ - విచారించవలయును.

తా॥ స్ఫుట సూర్యుని భాగలవల్ల షడశీతి ముఖత్వంబునున్నూ, సాయన రవివలన మేషాది అయనములనున్నూ చూడవలెనుకు.



## అగస్త్యాస్తమయ ప్రవేశము.

శ్లో॥ అగస్త్యాస్తమయంప్రాహు స్సప్తశైలైర్మనీషిణః ।
ఉదయంగిరినందైశ్చ స్ఫుటసూర్యసమాంశకైః ॥

టీ॥ మనీషిణః - విద్వాంసులు, స్ఫుటసూర్యసమాంశకైః - స్ఫుటసూర్య — స్ఫుట రవియొక్క, సమాంశకైః - సమభాగలగు, సప్తశైలైః - ( సప్త - ౭, శైలైః — ౭, )-౭౭ చేతను, అగస్త్యాస్తమయం - అగస్త్యాస్తమయమును, ప్రాహుః - పలికిరి. గిరినందైశ్చ - ( గిరి - ౭, నందైశ్చ - ౯, ) - ౯౭ చేతను, ఉదయం - ఉదయమును, ( ప్రాహుః ) చెప్పఁబడెను.

తా॥ స్ఫుట సూర్యునియొక్క ౭౭ భాగలచేత అగస్త్యాస్తమయమనియు, ౯౭ భాగలచేత అగస్త్యోదయమనియు విద్వాంసులుచేత చెప్పఁబడెనని తా॥

శ్లో॥ స్వదేశాక్షప్రభాష్టఘ్నా హీనయుక్తాతదంశకైః ।
అగస్త్యాస్తమయోంశాస్స్యు రుదయాంశాస్స్వదేశజాః ॥

టీ॥ అష్టఘ్నా - ౮ చే గుణింపఁబడిన, స్వదేశాక్షప్రభా - స్వదేశ విషువచ్ఛాయ, తదంశకైః - ఆ అగస్త్యాస్తమయోదయ భాగలచె, హీనయుక్తా - హీన — తగ్గినదియు, యుక్తా - కూడినదియు నగుచుండ, స్వదేశజాః - స్వదేశీయములైన, అగస్త్యాస్తమయాంశాః - అగస్త్యాస్తమయాంశములును, ఉదయాంశాః - ఉదయాంశములును, స్యుః - కాగలవు.

తా॥ స్వదేశ విషువచ్ఛాయాంగుళ వ్యంగుళములను, లిప్తా విలిప్తలనుగా భావించుకొని, ౮ చె గుణించి దానిని అగస్త్యాస్తమయ భాగములగు ౭౭ లో తివచవలెననియు ఉదయ భాగలగు ౯౭ లో కలపవలెననియు ఇట్లు జేయగా స్వదేశాస్తమయోదయ భాగలగుననియు తా॥

## రాశ్యాత్మక గ్రహములను నక్షత్రాత్మకముగా మార్చుట.

శ్లో॥ భాగీకృతగ్రహాస్త్రిఘ్నః ఖవేదైర్భాజితఃఫలం ।
నక్షత్రనాడికారూపం స్యాత్తదేవహిఖేచరః॥

టీ॥ భాగీకృతగ్రహః = భాగరూపముగా జేయఁబడిన గ్రహము, త్రిఘ్నః = 3 చే గుణింపఁబడినదై, ఖవేదైః – ( ఖ - ౦, వేదైః - ౪, ) - (౪౦) చేత, భాజితః = భాగింపబడగా నేర్పడిన, ఫలం - లబ్ధము, నక్షత్రనాడికా రూపం - నక్షత్రఘటికా రూపముగల, ఖేచరః - గ్రహము, తదేవ - ఆ లబ్ధమే, స్యాత్ - అగును.

తా॥ స్ఫుట గ్రహ రాసులను 30 చే గుణించి క్రింది భాగలను కలుపుకొని ఆ భాగ లిప్తా విలిప్తలను 3 చే గుణించి ౪౦ చే భాగించగా ( ౬౦ ఘడియల ప్రమాణమైన ) – నక్షత్ర నాడికారూపముగల గ్రహమగునని తా॥

శ్లో॥ యద్వారాశ్యాదిఖేటస్య లిప్తాఃఖఖగజైర్హృతాః।
ఫలంతారాత్మకఃఖేటో భవేదితివినిశ్చితః॥

టీ॥ యద్వా – మఱియొక పక్షంబున, రాశ్యాది ఖేటస్య - రాశ్యాదిస్ఫుట గ్రహముయొక్క, లిప్తాః - లిప్తలు, ఖఖగజైః - (ఖ - ౦, ఖ - ౦, గజైః - ౮,) – (౮౦౦) చే హృతాః - భాగింపబడగా నేర్పడిన, ఫలం - లబ్ధము, తారాత్మకః ఖేటః - నక్షత్ర స్వరూపముగల గ్రహము, భవేదితి - అగునని, వినిశ్చితః – నిశ్చయింపఁబడెను.

తా॥ మఱియొక పక్షంబున రాశ్యాది స్ఫుట గ్రహమును లిప్తలుచేసికొని (౮౦౦) చే భాగించగా వచ్చిన లబ్ధము పూర్వ శ్లోకోక్త ప్రకారము నక్షత్రనాడికా రూప గ్రహమగునని తాత్పర్యము.

శ్లో॥ నక్షత్రాత్మకఖేటస్య నాడికాఃకరతాడితాః।
నవభక్తాఃఫలంభాగ పూర్వకోఖేచరోభవేత్॥

టీ॥ నక్షత్రాత్మక ఖేటస్య - నక్షత్ర రూప గ్రహముయొక్క, నాడికాః– ఘడియలు, కరతాడితాః - ౨ చే గుణింపబడినవై, నవభక్తాః - ౯ చే భాగింపబడుచుండగా నేర్పడిన, ఫలం - లబ్ధము, భాగపూర్వకః - భాగపూర్వకమైన, ఖేచరః – గ్రహము, భవేత్ – అగును.

తా॥ పూర్వోక్తమగు (౬౦) ఘడియల (ప్రమాణముగల) నక్షత్రాత్మక గ్రహముయొక్క ఘడియలను, ౨ చే గుణించి ౯ చే భాగించగా లబ్ధము భాగలగును. ఆ శేషమువల్ల లిప్తావిలిప్తలను సాధించుకొనవలెను.



## తిథినిర్ణయము (అపరాహ్ణవ్యాప్తిః)

శ్లో॥ అహ్నో౽ష్టాంశంద్విధావేద నిఘ్నాత్పూర్వతిథింత్యజేత్,
త్రిఘ్నం పరతిథే శ్శోధ్య మధికం యత్ర సాతిథిః॥

టీ॥ అహ్నః – అహః ప్రమాణము యొక్క, అష్టాంశం - ఐదవ భాగమును, ద్విధా - రెండు విధములుగా బెట్టి, అందు మొదటి ప్రతి, వేదనిఘ్నాత్ - ౪ చె గుణింపఁబడిన ఘడియాది రూపమువల్ల, పూర్వ తిథిం - పూర్వతిథి ఘడియలను, త్యజేత్ = తీవచవలెను. రెండవ ప్రతి, త్రిఘ్నం -, 3 చె గుణింపబడినదై, పరతిథేః - మరుదిన మం దుదయముననుండు తిథి ఘటికా రూపమువల్ల శోధ్యం – తీవచదగినదగును. ఇట్లు చేయగా యత్ర - ఎక్కడ, అధికం - అపరాహ్ణవ్యాప్తి అధికమో, సా - ఆ దినమునందు తిథిః - తిథిపెట్టవలెను.

తా॥ అహః ప్రమాణ ఘడియలను ౫ చే భాగించి వచ్చిన లబ్ధమును రెండు ప్రతులు పెట్టి అందు మొదటి ప్రతిని ౪ చే గుణించి దానిలోః పూర్వ తిథి ఘడియలను (తీవిచి) ఆ శేషమును నెఱుంగవలెను. మఱియు రెండవ ప్రతిని 3 చే గుణించి దానిని మరుదిన మందుదయముననుండు తిథి ఘడియలలోః (తీవిచి) ఆశేషము నెఱుంగవలెను. ఈ ద్వి విధ నిర్ణయము చెయఁదగును అపరాహ్ణవ్యాప్తి ఏ దిన మందు అధికమగునో ఆదినమందు తిథినిర్ణయము చెయఁదగును. " శ్లో॥ క్షీణమానేతుపూర్వైవ వర్ధమానేతువైపరా " అను న్యాయము చొ॥ తిథి నిర్ణయము చెయఁదగును.

# కుజాది పంచ గ్రహ స్ఫుట క్రమము.

## —♦ అత్ర శీఘ్రోచ్చ నిర్ణయము ♦—

శ్లో॥ కుజ జీవ శనీనాం తు రవిశ్శీఘ్రోచ్చ నామకః ।
జ్ఞశుక్రయోర్గ్రహస్సూర్యః భవేత్తౌ శీఘ్ర నామకౌ ॥

టీ॥ రవిః = మధ్య సూర్యుఁడు, కుజ జీవ శనీనాం = కుజ గురు శనులకు, శీఘ్రోచ్చనామకః = శీఘ్రోచ్చమనెడు పేరుగలవాఁడగును. జ్ఞశుక్రయోః = బుధ శుక్రులకు, సూర్యః = ఆ మధ్య సూర్యుఁడే, గ్రహః = గ్రహము, భవేత్ = అగును. తౌ = ఆ బుధ శుక్రులు, శీఘ్రనామకౌ = శీఘ్రోచ్చమనెడు పేరుగలవారగుదురు.

తా॥ కుజ గురు శనుల నెడి గ్రహములయొక్క, స్ఫుటమందు, భుజా ఫల భాగ సంస్కార కృత మధ్య సూర్యుఁడు శీఘ్రోచ్చముగానగును. బుధ శుక్రులకు, స్ఫుటమందు, ఆ భుజా ఫల భాగ సంస్కార కృత మధ్య సూర్యుఁడే గ్రహముగా నగుననియు, ఆ బుధ శుక్రులు తమ స్ఫుటమందు శీఘ్రోచ్చములుగా నగునని తాత్పర్యము.

ఇచ్చట శీఘ్రకేంద్రమును, తద్ద్వారా, భుజ సాధనమును, తద్ద్వారా, శీఘ్ర పదక సాధనము జెప్పఁబడును.

శ్లో॥ గ్రహోనశీఘ్రంచలకేంద్ర నామకం షడ్భాధికం చక్రవిశో
ధితం తత్ । శీఘ్రే భుజస్స్యాద్భుజ భాగ సంఖ్యయా భవ
త్యజస్రంపదకం గ్రహస్య ॥

టీ॥ గ్రహోనశీఘ్రం = గ్రహము తీవఁబడిన శీఘ్రోచ్చము, చలకేంద్ర నామకం = శీఘ్రకేంద్ర మనెడు పేరుగలది యగును, తత్ = ఆ శీఘ్రకేంద్రము షడ్భాధికం = ఆఱు రాసులకంటె నధికమైనయెడల, చక్రవిశోధితం = (చక్ర ౧౨) ద్వాదశ సంఖ్యాకమువల్ల, విశోధితం = తీవఁబడుచుండఁగా మిగిలినది, శీఘ్రే=



శీఘ్ర సంస్కారమందు, భుజః = భుజము, స్యాత్ = అగును. భుజభాగసంఖ్యయా = ఆ భుజ భాగ సంఖ్యచేత, గ్రహస్య = ఆ యా గ్రహముయొక్క, పదకం = శీఘ్రపదకము అజస్రం = ఎల్లప్పుడును, భవతి = అగుచున్నది.

తా॥ శీఘ్రోచ్చయందు భుజా ఫల భాగ సంస్కార కృత మధ్య గ్రహమును తీవఁగా మిగిలినది శీఘ్ర కేంద్రమనఁ బడును. ఆ శీఘ్ర కేంద్రము ( ౬ ) - ఆఱు రాసులలోఁగా నున్నయెడల, అదియే భుజయగును. మరియు, ఆ శీఘ్ర కేంద్రము ఆఱు రాసులకంటె నధికమయినయెడల, ఆ కేంద్రమును (౧౨) పదిరెండు రాసులలోఁ తీవఁగా మిగిలిన రాశ్యాత్మకము, భుజయగును. ఇట్లు శీఘ్ర భుజను సాధించుకొని, ఆ భుజ రాసులను 30 చే గుణించి క్రింది భాగలు కలపఁగా శీఘ్ర సంస్కారమందు ఆ యా గ్రహముయొక్క, పదక సంఖ్యయగుననుట.

## —♦ శీఘ్ర సంస్కార భుజా ఫల సాధనము ♦—

శ్లో॥ పదకాంతరసంక్షుణ్ణం లిప్తాద్యంషష్టిహృత్ఫలం ।
వర్ధమానపదేయోజ్యం క్షీయమాణేవియోగతః ॥

టీ॥ లిప్తాద్యం = భుజయందుండు లిప్తావిలిప్తలు, పదకాంతరసంక్షుణ్ణం = ఆ యా శీఘ్ర పదకాంతర లిప్తావిలిప్తలచే చతుష్పత్రిన్యాయముగా గుణింపబడుచు, షష్టిహృత్ఫలం = షష్టి ౬౦ చేత, హృత్ = భాగించఁగా నేర్పడిన, ఫలం = లబ్ధమగు లిప్తావిలిప్తలను, వర్ధమానపదే = వృద్ధిబొందుచున్న శీఘ్ర పదక లిప్తావిలిప్తలయందు, యోజ్యం = కలుపదగినది, క్షీయమాణే = క్షయింపుచున్న పదకలిప్తలయందు, వియోగతః = తీవచుటవలన మిగిలిన లిప్తావిలిప్తలు,

శ్లో॥ భుజాఫలం భవత్యేవ శీఘ్రకర్మణి సర్వదా ॥
ధనర్ణంతత్ఫలం కార్యం కేంద్రే మేషతులాదిగే ॥

టీ॥ శీఘ్రకర్మణి = శీఘ్ర సంస్కారమందు, సర్వదా = ఈ గ్రంథమందెల్లప్పుడును, భుజాఫలం = భుజాఫలము, భవత్యేవ = అగుచున్నదేను, కేంద్రే = కేంద్రము, మేష తులాదిగే = మేషాది తులాదులం బొందుచుండఁగా, తత్ఫలం = ఆ భుజా ఫలమును, ధనర్ణం = ధన ఋణ సంజ్ఞా రూపముగల దానినిగా, కార్యం= చేయదగినది యగును.

తా॥ ఆ శీఘ్ర భుజ రాశ్యాదిక మందుండు లిప్తావిలిప్తలను ఆ యా శీఘ్ర పదకాంతర లిప్తావిలిప్తలచేత చతుష్ప్రతిన్యాయముగా గుణించి ౬౦ చే భాగించగా లబ్ధమగు లిప్తావిలిప్తలను వృద్ధిబొందుచున్న శీఘ్ర పదక లిప్తలయందు కలపవలెను. మఱియు క్షయింపుచున్న శీఘ్ర పదక లిప్తలయందు తీసివేయవలెను. ఇట్లుచేయగ ఆ గ్రహ భుజాఫలమగును ఆభుజాఫలమును మేషాదికేంద్రమైనయెడల మధ్యగ్రహములలో ధన సంజ్ఞగలదియగుననియు తులాదికేంద్రమైనయెడల మధ్య గ్రహములలో ఋణ సంజ్ఞగలదియగుననియు నభిప్రాయము.

## —♦ కుజాది గ్రహ స్ఫుట కర్మయందు, సంస్కార క్రమము ♦—

శ్లో॥ శీఘ్రం మందం పునర్మాందం శీఘ్రంచేతిచతుర్విధం।
కర్తవ్యంహి కుజాదీనాం స్ఫుటత్వే కర్మ సూరిభిః ॥

టీ॥ కుజాదీనాం = కుజాది పంచ గ్రహముల యొక్క, స్ఫుటత్వే = స్ఫుట భావమందు, (౧) శీఘ్రం = శీఘ్రసంస్కారంబును, (౨) మందం = మందసంస్కారంబును, పునః = మఱల, (3) మాందం (3) పునర్మందసంస్కారమును, పునశ్శీఘ్రం= (౪) పునశ్శీఘ్ర సంస్కారంబును, ఇతి = ఈ క్రమమున, చతుర్విధం = చతుర్విధమైన, కర్మ = సంస్కారవర్గము, సూరిభిః=విద్వాంసులచేత, కర్తవ్యం= చేయదగినది.

తా॥ కుజాది పంచ గ్రహములకు, స్ఫుటభావమందు (౧) శీఘ్ర సంస్కారంబును, (౨) మందసంస్కారంబును, (3) మఱల, పునర్మంద సంస్కారంబును, మఱల (౪) పునశ్శీఘ్ర సంస్కారంబును సంస్కరించవలెను. ఇట్లు క్రమముగా గ్రహమునకు నాలుగు సంస్కారములు చేయదగినవనుట.

## —○:గ్రహ ఫల సంస్కార క్రమము:○—

శ్లో॥ శైఘ్రం ఫలార్ధ ప్రథమం తతోమందార్ధ మేవచ।
పశ్చాన్మంద ఫలం సర్వం తద్వచ్ఛీఘ్ర ఫలం గ్రహేత్ ॥

టీ॥ ప్రథమం = మొదటిదైన, శైఘ్రం = శీఘ్రభావమగు, ఫలార్ధం = అర్ధ ఫలమాత్రంబును, తతః = తదనంతరము, మందార్ధమేవచ = మంద = మంద సంస్కారముయొక్క, అర్ధమేవచ = అర్ధఫలమాత్రంబును, పశ్చాత్ = అటుపిమ్మట, మంద



ఫలం = పునర్మంద ఫలమగు, సర్వం = సర్వంబును, తద్వదేవ = ఆప్రకారమే (అనగా సర్వంబుననుట) శీఘ్రఫలం = శీఘ్రసంస్కార ఫలమును, గ్రహేత్ = గ్రహించవలెను.

తా॥ మధ్య గ్రహమువల్ల యేర్పడిన ప్రథమ సంస్కార శీఘ్ర ఫలమును సగముచేసి దానిని మధ్య గ్రహములో ధన ఋణము లెఱిగి సంస్కరించవలెననియు, మఱియు, ఈ ప్రథమ సంస్కార గ్రహమువల్ల యేర్పడిన రెండవ సంస్కారమగు (మందఫలమును) సగముచేసి దానిని, ధన ఋణము లెఱిగి, ప్రథమ సంస్కార గ్రహములో సంస్కరించవలెననియు, మఱియు, ఈ రెండవ సంస్కారముచేసిన గ్రహమువల్ల యేర్పడిన మూడవ సంస్కారమగు (మందఫలంబంతయు) ధన ఋణము లెఱిగి, ప్రథమ సంస్కారముచేయని గ్రహములో (అనగా మధ్యగ్రహములో) సంస్కరించవలెననియు, మఱియు, ఈ మూడవ సంస్కారము చేసిన గ్రహమువల్ల యేర్పడిన నాలగవ సంస్కారమగు, (శీఘ్రఫలమంతయు,) ధన ఋణము లెఱిగి మూడవ సంస్కారముచేసిన గ్రహములో సంస్కరించవలెననియు, ఇట్లుచేయగా ఆ గ్రహము దృక్సిద్ధ మధ్యాహ్న స్ఫుట గ్రహంబగునని తా॥

---

ఈ అధ్యాయమందు ప్రథమ శ్లోకమందు జెప్పిన చొప్పున శీఘ్రోచ్చముల నెఱింగి ఆ యా గ్రహముల శీఘ్రోచ్చమువల్ల శీఘ్ర సంస్కార కేంద్రమును ఆ యా గ్రహముల మందోచ్చమువల్ల మంద సంస్కార కేంద్రమును సాధించవలెను. రవి చంద్రులకువలెనే కుజాది పంచ గ్రహంబులకును వారి వారి మందపదకములచేత మంద ఫలము సాధించవలెనని తెలియవలెను.

శ్లో॥ యథా సూర్యస్య చంద్రస్య స్ఫుటత్వే సాధ్యతే భుజః।
కుజాదీనాం తథామంద భుజస్సాధ్యోహ్యభేదతః ॥

టీ॥ సూర్యస్య = సూర్యునియొక్కయు, చంద్రస్య = చంద్రునియొక్కయు, స్ఫుటత్వే = స్ఫుటభావమందు, యథా = ఏ ప్రకారము, భుజః = భుజ, సాధ్యతే = సాధింపబడెనో, తథా = ఆ ప్రకారమే, కుజాదీనాం = కుజాది పంచగ్రహంబులకును, అభేదతః = భేదములేకుండగా, మందభుజః = మందభుజ, సాధ్యః = సాధింపదగినది.

తా॥ రవి చంద్రుల స్ఫుటమందు ఆ రవి చంద్రులకు యెట్లు భుజ సాధనము చేయబడెనో ఆ ప్రకారమే కుజాది పంచ గ్రహంబులకును మందభుజను సాధించవలెను. ఈ మంద భుజమువల్ల రవి చంద్రులకువలెనే పదక సంఖ్యలను దెలిసి ఈ గ్రంథమందుండు ఆ యా గ్రహముల మంద పదక లిప్తావిలిప్తలనున్నూ ఆ యా మంద పదకాంతర లిప్తావిలిప్తలనున్నూ వ్రాసికొని రవి చంద్రులకు వలెనే కుజాది పంచ గ్రహంబులకును మందఫలమును సాధించవలెనని యభిప్రాయము.

—♦ కుజునకు ప్రథమ సంస్కారోదహారణము ♦—

| | |
|---|---|
| మొదట చెప్పిన ౧ శ్లోక ప్రకారము ఇతనికి రాశ్యాది భుజాఫలభాగ సంస్కార మధ్యరవియే శీఘ్రోచ్చము, | రా-భా-లి-విలి<br>౧-౨౩- ౩-౪౯ |
| ఇందులో ౨శ్లోక ప్రకారము గ్రహమైన రాశ్యాది మధ్యకుజుని తీవచగా శీఘ్రకేంద్రము | ౭- ౩-౪౫-౫౦<br>౬-౧౯-౧౭-౫౯ |
| ఇది ఆఱు రాసులకంటె నధికమై నందున, ′౧౨-౨౯-౫౯-౬౦<br>౬-౧౯-౧౭-౫౯ | |
| రాశ్యాది శీఘ్రభుజ ౫-౧౦-౪౨- ౧ | |
| ఈ భుజ రాసులను ౫<br>౩౦<br>౧౫౦<br>౧౦<br>౧౬౦ | |

వ కుజ శీఘ్ర పదక లిప్తావిలిప్తలు ౧౭౮౩-౪౧ ఋణాంతర లిప్తావిలిప్తలు ౫౭-౧౦ ఈ అంతర లిప్తావిలిప్తలచేత, భుజ లిప్తావిలిప్తలగు ౪౨-౧ ని పూర్వోక్త ప్రకారము చతుష్పృతి న్యాయముగా గుణించి ౬౦ చే భాగించగా వచ్చిన లబ్ధ లిప్తావిలిప్తలు ౪౦-౨ ను, క్షయింపుచున్న పదకమైనందున, ఆ శీఘ్ర పదకములో తీవచగా మిగిలిన లిప్తావిలిప్తలు ౧౭౪౩-౩౯ ఇదియే పూర్వోక్త ప్రకారము శీఘ్ర భుజా ఫలమగును. మఱియు, శీఘ్రకేంద్రము ౬ రాసులకంటె నధికమైయున్నందున (తులాదికేంద్రమగుటచేత) యీ భుజాఫలము ఋణ సంజ్ఞగలది యగును.



కనుక, పూర్వోక్త ప్రకారము యీ భుజాఫలమును అర్ధించగా వచ్చిన లిప్తావిలిప్తలు ౮౭౧-౫౦ వీనిని ౬౦ చే భాగించగా వచ్చిన భాగాదులు ౧౪-౩౧-౫౦ వీనిని పై రాశ్యాది మధ్య కుజుడగు ౭—౩—౪౫—౫౦ లో తీవచగ, రాశ్యాది ఈ ౬-౧౯-౧౪-౦ ప్రథమ సంస్కార కుజుడాయెను.

## ౨డవ సంస్కారము.

ఇఁకను రెండవ సంస్కార క్రమమున మంద సంస్కారము చెప్పఁబడును. కుజుని రాశ్యాది మందోచ్చము, ౪-౧౦-౨-౪౫ దీనిలో రాశ్యాది ప్రథమ సంస్కార కుజుడగు, ౬-౧౯-౧౪-౦ ఇతని తీవచగా వచ్చిన రాశ్యాది మంద కేంద్రము ౯-౨౦-౪౮-౪౫ ఈ కేంద్రము ౯ రాసులకంటె నధికమైనందున ౧౨ రాసులలో తీవచగా వచ్చిన రాశ్యాది మంద భుజ ౨-౯-౧౧-౧౫ ఈ భుజ రాసులగు ౨ ని, ౩౦ చే గుణించి క్రింది భాగలను కలపగా, కుజుని ౬౯దవ మందపదక లిప్తావిలిప్తలు ౬౪౭-౨౯ అంతర లిప్తావిలిప్తలు ౪-౭ ఈ అంతర లిప్తావిలిప్తలచేత మంద భుజ లిప్తావిలిప్తలగు ౧౧-౧౫ ను చతుష్పృతిన్యాయముగా గుణించి ౬౦ చే భాగించగా వచ్చిన లబ్ధ లిప్తావిలిప్తలు ౦-౪౬ వీనిని కుజ మంద పదకములో కలపగా ఆయిన లిప్తావిలిప్తలు ౬౪౮-౧౫ ఇదియే మంద భుజా ఫల మనఁబడును. మఱియు, మంద కేంద్రము ౬ రాసులకంటె నధికమైనందున (తులాది కేంద్రమగుటచేత) ఈ భుజాఫలము ఋణ సంజ్ఞగలదియగును. కనుక, పూర్వోక్త ప్రకారము ఈ మంద భుజాఫలమును అర్ధించగా వచ్చిన లిప్తావిలిప్తలు ౩౨౪-౭ వీనిని ౬౦ చే భాగించగా భాగాది మంద భుజాఫలం ౫-౨౪-౭ దీనిని ప్రథమ సంస్కార కుజ రాశ్యాదికమగు ౬-౧౯-౧౪-౦ లో తీవచగా, రాశ్యాది ఈ ౬-౧౩-౪౯-౫౩ ద్వితీయ సంస్కార కుజుడాయెను.

## ౩డవ సంస్కారము.

మఱియు పూర్వోక్త క్రమమున మఱల మంద సంస్కారమును పూర్వోక్త ప్రకారము చేయవలెను. ద్వితీయ సంస్కార కుజుని అతని మందోచ్చములో తీవచగా రాశ్యాది మంద కేంద్రము ౯-౨౬-౧౨-౫౨ దీనికి మందభుజ ౨-౩-౪౭-౮ దీని ౬౩ వ మంద పదక లిప్తావిలిప్తలు ౬౧౮-౪౩ అంతర లిప్తావిలిప్తలు ౫-౧౬ ఋణ భుజా ఫల భాగాదులు ౧౦-౨౨-౫౧ ఈ భుజా ఫలమును పూర్వోక్త ప్రకా

రము అర్ధించకుండా, పూర్వోక్త ప్రకారము, రవి భుజా ఫల భాగ సంస్కార మధ్య కుజునియందు తీవచగ, రాశ్యాది తృతీయ సంస్కార కుజుడు ౬-౨౩-౨౨-౫౯ ఆయెను.

## ౪ వ సంస్కారము.

ఇఁకను, పూర్వోక్త క్రమమున, శీఘ్ర సంస్కారమును, ( మొదటి సంస్కారము వలెనే ) చేయవలెను. కనుక, తృతీయ సంస్కార కుజుని అతని రాశ్యాది శీఘ్రోచ్చ యగు ౧-౨౩-౩-౪౯ లో తీవచగ, రాశ్యాది శీఘ్ర కేంద్రము ౬-౯-౪౦-౫౦ దీని రాశ్యాది శీఘ్ర భుజ ౫-౦-౧౯-౧౦ కి ౧౫౦ వ శీఘ్ర పదక లిప్తావిలిప్తలు ౨౧౮౯-౫౯ ఋణాంతర లిప్తావిలిప్తలు ౨౮-౫౧ శీఘ్ర ఋణ భుజాఫలము రాశ్యాది ౧-౬-౨౦-౪౬ దీనిని పూర్వోక్త ప్రకారము అర్ధించకుండా తృతీయ సంస్కార కుజునిలో తీవచగ, రాశ్యాదిగా మధ్యాహ్నదృక్సిద్ధ స్ఫుటకుజుడు ౫-౧౭-౨-౧౩ ఆయెను.

ఇట్లు బుధ గురు శుక్ర శనులకును, నాలుగు సంస్కారములు క్రమముగ జేయగా, దృక్సిద్ధ స్ఫుట గ్రహంబులగును. గురు శనులకు ( కుజునకు వలెనే ) మధ్య రవిని శీఘ్రోచ్చముగ బెట్టుకొనవలెను. బుధ శుక్రులకు మాత్రము మధ్య రవిని ( గ్రహముగ ) బెట్టుకొని, ఆ బుధ శుక్రులను, శీఘ్రోచ్చలనుగ దెలిసికొని, ( కుజునకువలెనే ) క్రమముగ నాలుగు సంస్కారములను జేయగా దృక్సిద్ధ స్ఫుట గ్రహంబులగును.

### —♦ కుజాదులకు మందగతి సాధన క్రమము ♦—

శ్లో॥ ద్వితీయ పర్యాయ పదాంత రేణ మాందేన సంతాడితమధ్య భుక్తేః । ఖతర్క లబ్ధేనయుతాఽయుతాచేత్ స్ఫుటాగతిః కర్కిమృగాది కేంద్రాత్ ॥

టీ॥ మాందేన = మంద కర్మ సంబంధమైన, ద్వితీయపర్యాయ పదాంతరేణ = రెండవ పర్యాయ పదకాంతరముచేత, సంతాడిత మధ్య భుక్తేః = సంతాడిత = గుణింపబడిన, మధ్య భుక్తేః = గ్రహ మధ్య గతియొక్క, ఖతర్క లబ్ధేన = ౬౦ వ భాగమగు లబ్ధచేత, కర్కిమృగాదికేంద్రాత్ = కర్క్యాదిమకరాది కేంద్రమునుబట్టి



యుతాఽయుతాచేత్ = సంకలన వ్యవకలనము చేయబడినయెడల, గతిః = గ్రహ మధ్యగతి, స్ఫుటా = మంద స్ఫుటగతియగును.

తా॥ కుజాది పంచ గ్రహ మధ్యగతిని రెండు ప్రతులుపెట్టి, అందొక ప్రతిని రెండవ పర్యాయ మంద పదకాంతరముచేత ( అనఁగా మూడవ సంస్కారాంతరము చేననుట ) చతుష్ప్రతి న్యాయముగ గుణించి ౬౦ చే భాగించగ వచ్చిన లిప్తావిలిప్తలను ( ద్వితీయ పర్యాయ మంద కేంద్రము ) కర్క్యాదియైనయెడల, రెండవ ప్రతిలో కలపవలెను. మకరాదియైనయెడల తీవచవలెను. ఇట్లుచేయగా మంద స్ఫుట గతి యగుననుట.

### —:♦ ఉదాహరణము ♦:—

కుజ మధ్యగతి లిప్తావిలిప్తలు ౩౧-౨౬ దీనిని రెండు ప్రతులుపెట్టి అందొక ప్రతిని మూడవ సంస్కార మంద పదకాంతర లిప్తావిలిప్తలగు ౫-౧౬ చేత చతుష్ప్రతి న్యాయముగా గుణించి ౬౦ చే భాగించగ వచ్చిన లబ్ధ లిప్తావిలిప్తలు ౨-౪౫ వీనిని ( మూడవ సంస్కార మంద కేంద్రము మకరాదియగుటవల్ల ) రెండవ ప్రతియగు ౩౧-౨౬ లో తీవచగ మిగిలిన లిప్తావిలిప్తలు ౨౮-౪౧ ఇదియే కుజ మంద స్ఫుట గతి యగును. బుధ శుక్రులకు సూర్యుడే గ్రహము గనుక అతని స్ఫుట గతియే మంద గతి యగునని తెలియవలెను.

### —♦ కుజాదులకు శీఘ్రగతిని దెచ్చు క్రమము ♦—

శ్లో॥ మందగత్యూన శీఘ్రోచ్చ గతిః కేంద్ర గతిర్భవేత్ ।
గ్రహస్యోదయ వక్రాది కాలస్సంసాధ్యతేతయా ॥

టీ॥ మందగత్యూన శీఘ్రోచ్చగతిః = మందగతి తీవచబడిన శీఘ్రోచ్చ మధ్యగతి, కేంద్రగతిః = కేంద్రగతి, భవేత్ = అగును. తయా = ఆ కేంద్రగతిచేత, గ్రహస్య = కుజాదికముయొక్క, ఉదయవక్రాదికాలః = ఉదయవక్ర వక్రత్యాగాస్తమయాదికాలము, సంసాధ్యతే = సాధింపబడును.

తా॥ పూర్వోక్తమగు మందస్ఫుటగతిని శీఘ్రోచ్చముయొక్క మధ్యగతిలో తీవగా మిగిలినది కేంద్ర గతియగును. ఆ కేంద్రగతిచేత గ్రహముయొక్క ఉదయాస్తమయవక్ర వక్రత్యాగాదికాలము సాధింపబడుననుట.

---

## *○* ఉదాహరణము *○*

కుజ మంద స్ఫుట గతి ౨౮-౪౧ దీనిని ఇతని శీఘ్రోచ్చము (సూర్యుడు) అతని మధ్యగతి ౫౯-౮ దీనిలో తీవచగ మిగిలిన లిప్తావిలిప్తలు ౩౦-౨౭ ఇదియే కుజుని కేంద్ర గతి యగును. బుధ శుక్రులకు ఆ బుధ శుక్రుల మధ్య గతులనుగా నెఱుంగవలెను.

---

## —* కుజాదులకు శీఘ్రస్ఫుటగతిని సాధించు క్రమము *—

శ్లో॥ గ్రహకేంద్రగతిశీఘ్ర పదకాంతరతాడితా।
ఖరసాప్తఫలమంద భుక్తౌయోజ్యంధనాంతరే॥

టీ॥ గ్రహ కేంద్ర గతిః = కుజాది గ్రహముల యొక్క కేంద్ర గతి, శీఘ్ర పదకాంతరతాడితా = శీఘ్రపదకాంతర = ద్వితీయపర్యాయ శీఘ్రపదకాంతరముచేత, తాడితా = గుణింపబడినదగుచు, ఖరసాప్తఫలం = ఖరస - ( ఖ - ౦, రస - ౬, )౬౦ చేత, ఆప్త - భాగింపబడగ నేర్పడిన, ఫలం = లబ్ధము, ధనాంతరే = ఆ శీఘ్రపదకము ధనాంతరముగలదైయైనయెడల, మందభుక్తౌ = గ్రహమందస్ఫుటగతియందు, యోజ్యం= కూర్పదగినదియగును.

శ్లో॥ ఋణాంతరే వియోగేన గతి స్స్పష్టతరా భవేత్।
యదాఫల కలాదిభ్య శ్శుద్ధా మంద గతిర్యది॥

టీ॥ ఋణాంతరేయది = ఆ శీఘ్రపదకము ఋణాంతరము గలదియైనయెడల, వియోగేన = మంద స్ఫుటగతిలో తీవచుటచేత, గతిస్స్పష్టతరా = స్ఫుటగతి, భవేత్ =



అగును. యదా = ఎప్పుడు, ఫలకలాదిభ్యః = ఆ లబ్ధ లిప్తావిలిప్తలవల్ల, మందగతిః = గ్రహ మందగతి, శుద్ధా = తీవచబడునో,

శ్లో॥ తదావక్రగతిస్తస్య గ్రహస్య భవతి ధ్రువమ్।
గతేస్స్ఫుటత్వం సంస్కార ద్వితయేన ప్రజాయతే॥

టీ॥ తదా = అప్పుడు, తస్యగ్రహస్య = ఆ గ్రహమునకు, వక్రగతిః = వక్రగతి, భవతి = అగుచున్నది. ధ్రువం = నిశ్చయము, గతేస్స్ఫుటత్వం = కుజాది గ్రహగతి యొక్క స్ఫుట భావము, సంస్కారద్వితయేన = రెండు సంస్కారములచేత, ప్రజాయతే = కలుగుచున్నది.

తా॥ కుజాది గ్రహ కేంద్రగతి నాలగవ సంస్కార సంబంధమగు (శీఘ్రపద కాంతరముచేత) గుణించి దానిని ౬౦ చె భాగించగ వచ్చిన లిప్తావిలిప్తలను ఆశీఘ్ర పదకాంతరము ధనాంతరమైనయెడల గ్రహ మందగతిలో కలపవలెను. ఋణాంతరమైనయెడల మందగతిలో తీవచగ స్ఫుటగతియగును. మఱియు ఎప్పుడైతే ఆ లబ్ధ లిప్తావిలిప్తలు అధికమై మందగతి తక్కువగునో అప్పుడు ఆ లబ్ధ లిప్తావిలిప్తలలో మందగతిని తివచగ మిగిలినది ఆ గ్రహముయొక్క వక్ర గతియగును. ఇట్లు కుజాది గ్రహములకు రెండు సంస్కారముల చెత గతి స్ఫుటత్వము కలుగుచున్నదనుట.

---

## ○* ఉదాహరణము *○

కుజుని కేంద్రగతి లిప్తావిలిప్తలు ౩౦-౨౭ దీనిని ఇతని ద్వితీయ పర్యాయ శీఘ్ర పదకాంతర ఋణ లిప్తావిలిప్తలగు ౨౮-౫౧ వీనిచేత చతుష్ప్రితి న్యాయముగ గుణించి ౬౦ చే భాగించగ వచ్చిన లబ్ధ లిప్తావిలిప్తలు ౧౪-౩౮ వీనిని ఋణాంతరము గనుక మందగతి లిప్తావిలిప్తలగు ౨౮-౪౧ వీనిలో తీవచగ మిగిలినది ౧౪-౩ ఇదియే కుజ స్ఫుటగతియగును. మంద గతి తక్కువై ఆ లబ్ధ లిప్తావిలిప్తలు యెక్కువైనప్పుడు దానిలో మందగతిని తీవచగ మిగిలినది వక్రగతియగును. ఈ కుజునకు వక్రగతి కాదు.

## కుజాది పంచ గ్రహములకు వక్ర కేంద్ర భాగముల క్రమము.

శ్లో॥ గుణర్తు చంద్రైశ్శర వేద రూపైః బాణాక్షి చంద్రైర్గిరితర్క-
రూపైః । గుణేందు భూభిశ్చల కేంద్ర భాగై ర్వక్రత్వ మా
యాంతికుజాదిఖేటాః ॥

టీ॥ కుజాది ఖేటాః = కుజాది పంచ గ్రహంబులు క్రమముగ, చలకేంద్ర భాగైః = ద్వితీయ శీఘ్ర కేంద్ర భాగలగు, గుణర్తుచంద్రైః = ( గుణ - ౩, ఋతు - ౬, చంద్రైః - ౧, ) - ౧౬౩ భాగలచేతను, శరవేదరూపైః = ( శర - ౫, వేద - ౪, రూపైః - ౧, ) - ౧౪౫ భాగలచేతను, బాణాక్షిచంద్రైః = ( బాణ - ౫, అక్షి - ౨, చంద్రైః - ౧, ) - ౧౨౫ భాగలచేతను, గిరితర్కరూపైః = ( గిరి - ౭, తర్క - ౬, రూపైః - ౧, ) - ౧౬౭ భాగలచేతను, గుణేందుభూభిశ్చ = ( గుణ - ౩, ఇందు - ౧, భూభిః - ౧, ) - ౧౧౩ భాగలచేతను, వక్రత్వం = వక్ర స్వ భావమును, ఆయాంతి = పొందుచున్నారు.

తా॥ ఆ యా గ్రహముల ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్రమును ( ౪ నాల్గవ సంస్కార కేంద్రమునను ) భాగలుచేయగా, ౧౬౩ భాగలున్నప్పుడు కుజుడును, ౧౪౫ భాగలున్నప్పుడు బుధుడును, ౧౨౫ భాగలున్నప్పుడు గురుడును, ౧౬౭ భాగలున్నప్పుడు శుక్రుడును, ౧౧౩ భాగలున్నప్పుడు శనియు, వక్రప్రారంభము బొందుచున్నారని తాత్పర్యము.

## —♦ వక్రత్యాగ కేంద్ర భాగలు ♦—

శ్లో॥ శైలాంక చంద్రైశ్శరచంద్ర బాహుభి ర్బాణాగ్ని నేత్రై
ర్గుణగోకుభిశ్చ। శైలాబ్ధి నేత్రైః క్రమశః కుజాద్యా ఋజుత్వ
మాయాంతిచ కేంద్రభాగైః ॥

టీ॥ కుజాద్యాః = కుజాది పంచ గ్రహంబులు, క్రమశః = క్రమముగాను, కేంద్రభాగైః = ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్ర భాగలగు, శైలాంకచంద్రైః = ( శైల - ౭, అంక - ౯, చంద్రైః - ౧, ) - ౧౯౭ భాగలచేతను, శరచంద్రబాహుభిః = ( శర - ౫, చంద్ర - ౧, బాహుభిః - ౨, ) - ౧౨౫ భాగలచేతను, బాణాగ్ని నేత్రైః = ( బాణ - ౫, అగ్ని - ౩, నేత్రైః - ౨, ) - ౨౩౫ భాగల చేతను, గుణగోకుభిశ్చ = ( గుణ - ౩, గో - ౯, కుభిః - ౧, ) - ౧౯౩ భాగల చేతను, శైలాబ్ధినేత్రైః = ( శైల - ౭, అబ్ధి - ౪, నేత్రైః - ౨, ) - ౨౪౭ భాగల చేతను, ఋజుత్వం = ఋజుస్వభావమును, ( అనగా వక్రత్యాగమునను ) ఆయాంతి = పొందుచున్నారనుట.



తా॥ ఆ యా గ్రహముల ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్రమును భాగలు చేయగా ౧౯౭ భాగలయినప్పుడు కుజుడును, ౧౨౫ భాగలయినప్పుడు బుధుడును, ౨౩౫ భాగలయినప్పుడు గురుడును, ౧౯౩ భాగలయినప్పుడు శుక్రుడును, ౨౪౭ భాగలయినప్పుడు శనియు, వక్రత్యాగమును [ అనగా ఋజుగతిని ] పొందుదురని తాత్పర్యము.

## —♦: వక్ర దినములు :♦—

శ్లో॥ రస తర్కైశ్చంద్రనేత్రై ర్వియద్బాహ్విందుభిః క్రమాత్ ।
నేత్రబాణై ర్భూత విశ్వై ర్గ్రహాణాం వక్రవాసరాః ॥

టీ॥ గ్రహాణాం = కుజాది పంచ గ్రహములకు, క్రమాత్ = క్రమముగా, వక్రవాసరాః = వక్ర దినములు, రసతర్కైః = ( రస - ౬, తర్కైః - ౬, ) కుజుడు ౬౬ దినములకును, చంద్రనేత్రైః = [ చంద్ర - ౧, నేత్రైః - ౨, ] - బుధుడు ౨౧ దినములకును, వియద్బాహ్విందుభిః = [ వియత్ - ౦, బాహుభిః - ౨, ఇందుభిః - ౧, ] - గురుడు ౧౨౦ దినములకును, నేత్రబాణైః = [ నేత్ర - ౨, బాణైః - ౫, ] - శుక్రుడు ౫౨ దినములకును, భూతవిశ్వైః = [ భూత - ౫, విశ్వైః - ౧౩ ] - శనైశ్చరుడు ౧౩౫ దినములకును, [భవంతి] అగుచున్నవి.

తా॥ కుజుడు ౬౬ దినములును, బుధుడును ౨౧ దినమును, గురుడు ౧౨౦ దినములును, శుక్రుడు ౫౨ దినములును, శనైశ్చరుడు ౧౩౫ దినములును, రమారమిగ వక్రించి యుందురని తాత్పర్యము.

—⁂ పశ్చాదస్తమయ కేంద్రభాగలు (మాఢ్యం) ⁂—

శ్లో॥ దంతాగ్నిభిస్సాయక బాణచంద్రై ష్షడ్వేద రామైర్గిరిసప్త
రూపైః। శూన్యాబ్ధి రామైః కుసుతాదయోస్తం ప్రయాంతి
పశ్చాచ్చల కేంద్రభాగైః॥

టీ॥ కుసుతాదయః = కుజాది పంచ గ్రహంబులు, క్రమః = క్రమముగా, చలకేంద్రభాగైః = ద్వితీయపర్యాయ శీఘ్ర కేంద్రభాగలగు, దంతాగ్నిభిః = [ దంత - 3౨, అగ్నిభిః - 3, ] - 33౨ భాగలును, సాయకబాణచంద్రైః = [ సాయక - ౫, బాణ - ౫, చంద్రైః - ౧, ] - ౧౫౫ భాగలచేతను, షడ్వేదరామైః = [ షట్ ౬, వేద - ౪, రామైః - 3, ] - 3౪౬ భాగలచేతను, గిరిసప్తరూపైః = [ గిరి - ౭, సప్త - ౭, రూపైః - ౧, ] - ౧౭౭ భాగలచేతను, శూన్యాబ్ధిరామైః = [ శూన్య - ౦, అబ్ధి - ౪, రామైః - 3, ] - 3౪౦ భాగలచేతను, పశ్చాదస్తం = పశ్చాదస్తమయమును, ప్రయాంతి = పొందుచున్నారనుట.

తా॥ నాలగవ సంస్కార కేంద్ర భాగలగు 33౨ భాగలచేత కుజుడును, ౧౫౫ భాగలచేత బుధుడును, 3౪౬ భాగలచేత గురుడును, ౧౭౭ భాగలచే శుక్రుడును, 3౪౦ భాగలచేత శనియు, పడమటి దిశను అస్తమించుచున్నారని తా॥

—* ప్రాగుదయ కేంద్రభాగలు (మాఢ్యనివృత్తి) *—

శ్లో॥ నాగాశ్విభిః స్సాయక శూన్యదస్రై ర్వేదేందుభిః పావక
నాగ చంద్రైః। ఖబాహుభిశ్చంచల కేంద్రభాగైః
ప్రాచ్యాంకుజాద్యా ఉదయం ప్రయాంతి॥

టీ॥ కుజాద్యాః = కుజ బుధ శుక్ర శనులు, క్రమః = క్రమముగా, చంచల కేంద్రభాగైః = ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్ర భాగలగు, నాగాశ్విభిః = [ నాగ - ౮, అశ్విభిః - ౨, ] - ౨౮ భాగలచేతను, సాయకశూన్యదస్రైః = [ సాయక - ౫, శూన్య - ౦, దస్రైః - ౨, ] - ౨౦౫ భాగలచేతను, వేదేందుభిః = [ వేద - ౪, ఇందుభిః - ౧, ] - ౧౪ భాగలచేతను, పావకనాగచంద్రైః = [ పావక - 3, నాగ - ౮, చంద్రైః - ౧, ] - ౧౮3 భాగలచేతను, ఖబాహుభిః = [ ఖ - ౦, బాహుభిః - ౨, ] - ౨౦ భాగలచేతను, ప్రాచ్యా = తూర్పుదిక్కును, ఉదయం = ఉదయమును, ప్రయాంతి = పొందుచున్నారనుట.



తా॥ నాలగవ సంస్కార కేంద్ర భాగలగు ౨౮ భాగలచేత కుజుడును, ౨౦౫ భాగలచేత బుధుడును, ౧౪ భాగలచేత గురుడును, ౧౮3 భాగలచేత శుక్రుడును, ౨౦ భాగలచేత శనైశ్చరుడును, ప్రాగుదయమును బొందుచున్నారని తాత్పర్యము.

---

బుధ శుక్రులకు ప్రాగస్తమయ

—* కేంద్ర భాగలు *—

శ్లో॥ నవాభ్ర రామైస్తురగాగ్ని పావకైః ప్రాగస్తగౌ సౌమ్యసితౌ
చలాంశైః। పశ్చాద్జ్ఞశుక్రావుదయం ప్రయాతః కువ్యర్కై
స్త్రిదస్రైశ్చల కేంద్రభాగైః॥

టీ॥ సౌమ్యసితౌ = బుధ శుక్రులు క్రమముగ, చలాంశైః = తమ ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్ర భాగలగు, నవాభ్రరామైః = [ నవ - ౯, అభ్ర - ౦, రామైః - 3, ] - 3౦౯ భాగలచేతను, తురగాగ్నిపావకైః = [ తురగ - ౭, అగ్ని - 3, పావకైః - 3, ] - 33౭ భాగలచేతను, ప్రాగస్తగౌ = తూర్పు దిశ నస్తంగతులగుదురు. జ్ఞశుక్రౌ = బుధ శుక్రులు, చలకేంద్రభాగైః = ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్ర భాగలగు, కువ్యర్కైః — [ కు - ౧, అర్కైః - ౫, ] - ౫౧ భాగలచేతను, త్రిదస్రైః — [ త్రి - 3, దస్రైః - ౨, ] - ౨3 భాగలచేతను, పశ్చాదుదయం - పశ్చిమ దిక్కును ప్రయాతః - పొందుచున్నారనుట.

తా॥ చతుర్థ సంస్కార శీఘ్ర కేంద్రభాగలగు 3౦౯ భాగలచేత బుధుడును, 33౭ భాగలచేత శుక్రుడును, ప్రాగస్తమయమును బొందుచున్నారు. మఱియు పశ్చాదుదయమును బుధుడు ౫౧ భాగలచేతను, శుక్రుడు ౨3 భాగలచేతను, పశ్చాదుదయమును అనఁగా పడమర దిక్కును ఉదయించుచున్నారనుట.

శ్లో॥ తౌవక్ర కాలే స్తగతౌ ప్రతీచ్యాం ప్రాగుద్గతౌ శుక్రబుధౌ
తథైవ। స్వభావగత్యాస్తగతౌ జ్ఞశుక్రౌ ప్రాచ్యాం ప్రతీ
చ్యాం భవతః క్రమేణ॥

టీ॥ తౌ - ఆ, శుక్రబుధౌ — శుక్ర బుధులు, వక్రకాలే — వక్రసమయమందు, ప్రతీచ్యాం — పడమర దిశను, అగస్తగతౌ — అస్తంగతులును, ప్రాగుద్గతౌ — తూర్పు దిశ నుదయంగతులునగుదురు. తథైవః — ఆ ప్రకారమే, జ్ఞశుక్రౌ — బుధ శుక్రులు, స్వభావగత్యా — సవ్యగతిచేత, ప్రాచ్యాం — తూర్పు దిశను, అస్తగతౌ — అస్తంగతులును, ప్రతీచ్యాం — పడమర దిశను, భవతః — ఉదయంగతులును, క్రమేణ — క్రమంబుగ నగుచున్నారనుట.

తా॥ ఆ బుధ శుక్రులు వక్రకాలమందు పశ్చిమంబున నస్తమించి క్రమముగ ప్రాగుదయమును బొందుదురు. మఱియు ఆ బుధ శుక్రులు సవ్యగతిచేత తూర్పున నస్తమించి పడమర దిశ నుదయమును క్రమంబుగ బొందుదురని తా॥

—:♦ కుజాదులకు అస్తమయాది ఉదయ దినములు♦:—

శ్లో॥ ఖార్కా నృపా శూన్యగుణా దిశోంగ రామాః ప్రతీచ్యాం
దిశిచాస్తవాసరాః । జ్ఞశుక్రయోర్ద్రసగుణాః కుశైలాః
ప్రాగస్త కాలాద్దివసాభవంతి ॥

టీ॥ ప్రతీచ్యాందిశి - పడమర దిశను, అస్తవాసరాః - అస్తంగతి దినములు, అనఁగా, అస్తమయాది ఉదయ పర్యంత దినములనుట. ఖార్కాః - [ ఖ - ౦, అర్క - ౧౨, ] - ౧౨౦ దినములు ఇవి కుజునకును, నృపాః - ౧౬ దినములు ఇవి, బుధునకును, శూన్యగుణాః - [ శూన్య - ౦, గుణాః - ౩, ] - ౩౦ దినములు ఇవి గురునకును, దిశః - ౧౦ దినములు ఇవి శుక్రునకును, అంగరామాః - [ అంగ - ౬, రామాః - ౩, ] - ౩౬ దినములు ఇవి శనికిని, [ భవంతి - అగుచున్నవి ] జ్ఞశుక్రయోః - బుధ శుక్రులకు, ప్రాగస్తకాలాత్ - ప్రాగస్తమయదినమునుండి, దివసాః - పశ్చాదుదయ పర్యంత దివసములు, దస్రగుణాః - [ దస్ర - ౨, గుణాః - ౩, ] - ౩౨ దినములును, కుశైలాః - [ కు - ౧, శైలాః - ౭, ] - ౭౧ దినములును, భవంతి - అగుచున్నవి.

తా॥ పశ్చాదస్తమయ దినము మొదలుకొని ౧౨౦ దినములచె కుజుడును ౧౬ దినములచె బుధుడును, ౩౦ దినముచె గురుడును, ౧౦ దినములచె శుక్రుడును



౩౬ దినములచె శనియు, ప్రాగుదయమును పొందుచున్నారు. మఱియు ప్రాగస్తమయ దినము మొదలుకొని పశ్చాదుదయమును ౩౨ దినములచె బుధుడును, ౭౧ దినములచె శుక్రుడును, పొందుచున్నారని తా॥

—.-♦ కుజాదులకస్తమయ దినములు ♦—

శ్లో॥ శూన్యాంగ తర్కై స్తురగాగ్నిభిశ్చ దస్రాద్రిరామై శ్శశి
బాణనేత్రైః । ద్వివేద రామైర్దివసై స్తథాస్తం ప్రయాంతి
ఖేటాఉదితాః కుజాద్యాః ॥

టీక॥ ఉదితాః = తూర్పు దిశ నుదయించిన, ఖేటాః = గ్రహంబులగు, కుజాద్యాః = కుజాదులు, అస్తం = అస్తమయమును, శూన్యాంగతర్కైః = ( శూన్య - ౦, అంగ - ౬, తర్కైః - ౬, ) - (౬౬౦) అగు, దివసైః = దినముల చేతను, తురగాగ్నిభిశ్చ = ( తురగ - ౭, అగ్నిభిశ్చ - ౩, ) - ౩౭ దినములచేతను, దస్రాద్రిరామైః = ( దస్ర - ౨, అద్రి - ౭, రామైః - ౩, ) - ౩౭౨ దినములచేతను, శశిబాణనేత్రైః = ( శశి - ౧, బాణ - ౫, నేత్రైః - ౨, ) - ౨౫౧ దినములచేతను, ద్వివేదరామైః = ( ద్వి - ౨, వేద - ౪, రామైః - ౩, ) - ౩౪౨ దినములచేతను, తథా = పూర్వ గ్రంథోక్త ప్రకారము, అస్తం = అస్తమయమును, ప్రయాంతి = పొందుచున్నారనుట.

తా॥ ప్రాగ్దిశ నుదయించిన గ్రహములలో కుజుడు ౬౬౦ దినములకును, బుధుడు ౩౭ దినములకును, గురుడు ౩౭౨ దినములకును, శుక్రుడు ౨౫౧ దినములకును, శనైశ్చరుడు ౩౪౨ దినములకును, అస్తమించెదరనుట. అందు కుజ గురు శనులు పశ్చిమంబున నస్తమించెదరనియు, బుధ శుక్రులు తూర్పుననే అస్తమించెదరని యభిప్రాయము.

బుధ శుక్రులకు పశ్చాదుదయ పశ్చాదస్తమయ
—✻ దినములు ✻—

శ్లో॥ పశ్చా దుదయ మారభ్య పశ్చాదస్తమయావధి ।
పంచాగ్ని దివసాస్సౌమ్యే నేత్రతర్కకరాః కవౌ ॥

టీక॥ పశ్చాదయమారభ్య = పశ్చాదుదయము మొదలుకొని, పశ్చాదస్తమయావధి = పశ్చాదస్తమయపర్యంతము, సౌమ్యే = బుధుడు, పంచాగ్నిదివసాః =

( పంచ - ౫, అగ్ని - ౩, ) - ౩౫, దివసాః = దినంబులును, కవౌ = శుక్రుడు, నేత్రతర్కకరాః = ( నేత్ర - ౨, తర్క - ౬, కరాః - ౨, ) - ౨౬౨ దినంబులు నుందురనుట.

తా॥ పశ్చాదుదయము మొదలుకొని మరల పశ్చాదస్తమయమును జేయుట యందు బుధునకు ౩౫ దినంబుల కాలము పట్టుననియు, శుక్రునకు ౨౬౨ దినంబుల కాలము పట్టునని తాత్పర్యము.

## బుధ శుక్రులయొక్క ప్రాగస్త పశ్చాదుదయ వక్ర వక్ర —♦ త్యాగాదులకు క్రమముగా పరిమాణ దినములు ♦—

శ్లో॥ ప్రాగస్త కాలాద్దివసైర్ద్విరామైః పశ్చాదుబ్బుధస్యోదయమాహురస్మాత్ । నేత్రాగ్నిభిర్వక్రి సముద్భవస్తతస్త్రిభిః ప్రతీచ్యాందిశిచాస్తగత్వం ॥

టీక॥ బుధస్య = బుధునకు, ప్రాగస్త కాలాత్ = ప్రాగస్త కాలమునుండి, ద్విరామైః - ( ద్వి - ౨, రామైః - ౩, ) - ౩౨ అగు, దివసైః = దినములచేత, పశ్చాదుదయం = పశ్చాదుదయమును, ప్రాహుః - విద్వాంసులు చెప్పిరి. అస్మాత్ = ఈ పశ్చాదుదయమునుండి, నేత్రాగ్నిభిః = ( నేత్ర - ౨, అగ్నిభిః - ౩, ) - ౩౨ దినములచేత, వక్రసముద్భవః = వక్రించుటకలుగును. తతః = వక్రోత్పత్తి యైనపిమ్మట, త్రిభిః = మూడు దినములచేత, ప్రతీచ్యాందిశి = పడమర దిక్కునందు, అస్తగత్వ = అస్తగతత్వంబు పొందును.

శ్లో॥ తదాదితర్కేందుదినైస్తు పూర్వదిగుద్భవంస్యాదితిసంవదంతి। తతస్త్రిభిర్వక్రగతేర్విమోచనం కరాగ్నిభిఃప్రాగ్దిశిచాస్తగత్వం॥

టీక॥ తదాది = ఆ పశ్చాదస్తమయము మొదలుకొని, తర్కేందుదినైః = ( తర్క - ౬, ఇందు - ౧, ) - అగు, దినైః - దినములచేత, పూర్వదిగుద్భవం - ప్రాగుదయము, స్యాదితి - అగునని, సంవదంతి - చెప్పుదురు. తతః - ఆ ప్రాగుదయానంతరము, త్రిభిః - మూడు దినములచేత, వక్రగతేః - వక్రగతియొక్క, విమోచనం - విముక్తియగును. ( తతః ) అనంతరము, కరాగ్నిభిః - ( కర - ౨, అగ్నిభిః - ౩, ౩౨ దినములచేత, ప్రాగ్దిశి - తూర్పు దిక్కునందు, అస్తగత్వం - అస్తంగతత్వంబు పొందును.



తా॥ బుధునకు ప్రాగస్తమయ దినము మొదలు ౩౨ దినములకు పశ్చాదుదయంబుగలుగును. ఆ పిమ్మట ౩౨ దినములకు వక్రము కలుగును. ఆ పిమ్మట ౩ దినములకు పశ్చాదస్తమయంబు కలుగును. ఆ పిమ్మట ౧౬ దినములకు ప్రాగుదయంబగును. ఆ పిమ్మట ౩ దినములకు వక్రగతి విడుచును. ఆ పిమ్మట ౩౨ దినములకు ప్రాగస్తమయమగునని తాత్పర్యము.

శ్లో॥ శుక్రః ప్రతీచ్యుదయతోఽగ్నిగుణాక్షిభిస్స్యాద్వక్రీతతో గగననేత్రదినైస్తథాస్తం । ప్రాచ్యామథాష్టభిరుదేత్యథ బాణనేత్రైః నిర్వక్రముత్కృతికరైరథచాస్తమేతి ॥

టీక॥ శుక్రః - శుక్రుడు, ప్రతీచ్యుదయతః - పశ్చాదుదయము మొదలుకొని, అగ్నిగుణాక్షిభిః - ( అగ్ని - ౩, గుణ - ౩, అక్షిభిః - ౨, ) - ౨౩౩ దినములచేత, వక్రీవక్రగతిగలవాడు, స్యాత్ - అగును. తతః - అటుపిమ్మట గగననేత్రదినైః - ( గగన - ౦, నేత్ర - ౨, ) - ౨౦ అగు, దినైః - దినములచే, తథాస్తం - పశ్చాదస్తమయము నొందును. అథ - అనంతరము, ప్రాచ్యాం - తూర్పున, అష్టభిః - ౮ దినములచేత, ఉదేతి - ఉదయించుచున్నాడు. అథ - అనంతరము, బాణనేత్రైః - ( బాణ - ౫, నేత్రైః - ౨, ) - ౨౫ దినములచేత, నిర్వక్రం - వక్రత్యాగము నొందును. అథ - తదనంతరము, ఉత్కృతికరైః - ( ఉత్కృతి - ౨౬, కరైః - ౨, ) - ౨౨౬ దినములచేత, అస్తమేతి - ప్రాగస్తమయమును బొందుచున్నాడు.

తా॥ శుక్రుడు, పశ్చాదుదయము మొదలుకొని ౨౩౩ దినములకు వక్రించును. ఆ పిమ్మట ౨౦ దినములకు, పశ్చాదస్తంగతుడగును. అటుపిమ్మట ౮ దినములకు తూర్పున ఉదయించును. అటుపిమ్మట ౨౫ దినములకు వక్రత్యాగమగును. ఆ పిమ్మట ౨౨౬ దినములకు, తూర్పున అస్తమించుననుట.

## వక్రి వక్రిత్యాగోదయాస్తమయాది —* ప్రవేశ ఘటికా నిర్ణయము *—

శ్లో॥ వక్రావక్రోదయాస్తాంశాః ధ్రువాంశేభ్యోఽధికాల్పతః। కలీకృతాహ్నర్గతాః కేంద్రగత్యాయాతైష్యవాసరాః ॥

టీక। వక్రానక్రోదయాస్తాంశాః — వక్ర వక్రత్యాగో దయాస్తమయాంశలు, ధ్రువాంశేభ్యః — పూర్వోక్తములగు ఆ యా ధ్రువాంశములకంటె, అధికాల్పతః — అధిక అల్పత్వంబు గలిగియున్న యెడల, కలీకృతాః — ఆ కేంద్ర భాగాదులు లిప్తలు చేయబడినవై, కేంద్రగత్యా—ఆయా గ్రహ కేంద్రగతిచేత, హృతాః — భాగింపబడుచుండగా నేర్పడిన లబ్ధము, యాతైష్యవాసరాః — గత ఏష్య దినంబులగును.

తా॥ ఆ యా గ్రహముల ద్వితీయ పర్యాయ శీఘ్ర కేంద్రభాగలు, ఆ యా గ్రహములకు జెప్పిన వక్రవక్రత్యాగోదయాస్తమయ ధ్రువ భాగ సంఖ్యల కంటె, అధికాల్పములుగా నున్న యెడల, ఆ అధిక అల్పములగు భాగాదులను లిప్తలుచేసి, ఆ యా గ్రహ కేంద్రగతిచె భాగించగా లబ్ధము గత ఏష్య దినంబులగును. ఈ దినములవలన, యీ గ్రహ మిన్ని దినముల క్రిందట వక్రాది భావమును బొందినదనియైనను, మఱియు యిన్ని దినములకు వక్రాది భావమును పొందుననియయినను, తెలియవలెనని తాత్పర్యము.

శ్లో॥ ప్రతిచ్యస్తంగతేశుక్రే మౌఢ్యో దశదినావధి।
ప్రాగస్తగేభవేన్మౌఢ్యో సార్ధమాసద్వయావధి॥

టీక॥ శుక్రే - శుక్రుడు, ప్రతీచ్యస్తంగతే - పశ్చాదస్తమయమును బొందుచుండ, దశదినావధి - ౧౦ దినముల పర్యంతము, మౌఢ్యః - మౌఢ్యంబు ప్రాగస్తగే - ప్రాగస్తమయమును బొందుచుండ సార్ధమాసద్వయావధి - రెండున్నరమాస పర్యంతము, మౌఢ్యః - మౌఢ్యంబు, భవేత్ - అగును.

తా॥ శుక్రుడు, పశ్చాదస్తమయమును బొందుచుండ (౧౦) దినముల పర్యంతము మౌఢ్యమి యగును. శుక్రుడు ప్రాగస్తమయమును బొందుచుండ, రెండున్నర మాసము మౌఢ్యమి కలిగియుండుననుట.

శ్లో॥ గురోస్సదా ప్రతీచ్యాంతు దిశిచాస్తమయం భవేత్।
ప్రాచ్యాముదయ మేతస్య మౌఢ్యో మాసైక మేవహి॥

టీక॥ గురోః - గురునకు, సదా - ఎల్లప్పుడును, ప్రతీచ్యాందిశి - పడమర దిక్కునందు, అస్తమయం - అస్తమానము, భవేత్ - అగును. ప్రాచ్యాం - తూర్పు దిక్కునందున, ఉదయం - ఉదయమగును. ఏతస్య - ఈ గురునకు, మౌఢ్యః - మౌఢ్యత, మాసైకమేవహి - ఒక మాసమేను.

తా॥ బృహస్పతి (సర్వదా) పడమర దిక్కున అస్తమించును, తూర్పున ఉదయించును. ఈ గురు మౌఢ్యమి వొకమాసమేననుట.

ఇతి స్ఫుటాధికార స్సమాప్తః.

# అథ త్రిః ప్రశ్నాధ్యాయ ప్రారంభః

ఈ అధ్యాయమందు కొంతవఱకు శంకుస్థాపనము తద్వారా, దిక్సాధనమును, విషువచ్ఛాయా సాధనాదులను జెప్పఁబడును. ఈ ప్రశ్నాధ్యాయము గురుముఖంబుగ దెలిసికొనవలయును. గ్రంథ విస్తరముచే టీక వ్రాయబడలేదు.

శ్లో॥ యః కర్మసాక్షీభగవాన్ యోవేదప్రతిపాదితః।
తమాశ్రయే సదామోహ తమోరాశినవృత్తయే॥

మేషాయనదినేర్కస్య తులాయనదినేపివా । స్వదేశాక్షప్రభా సాధ్యాద్వా దశాంగుళశంకునా॥ ౧ ॥ సమీకృతశిలాయాం వా సమభూమితలేపివా । ఇష్టశంకోః ప్రమాణేన విలిఖేద్వృత్తమండలం॥ ౨ ॥ వృత్తమధ్యస్థితస్యాస్య శంకోః పూర్వాపరాహ్ణయోః । ఛాయాగ్రం యత్ర విశతి వృత్తం యత్ర విముంచతి॥ ౩ ॥ వృత్తే ప్రాక్పశ్చిమస్థాన ద్వయేబిందూకృతౌ యది । పూర్వాపరాఖ్యౌ తౌ స్యాతాం వక్ష్యమాణానుసారతః॥ ౪ ॥ పూర్వబిందుం సమారభ్య శంకుమూలస్యయత్నతః । కర్కటేనలిఖేదర్ధ చంద్రవద్వలయం తతః ॥ ౫ ॥ పశ్చాద్బిందుం సమారభ్య వలయ చంద్ర ఖండవత్ । శంకుదీర్ఘ ప్రమాణేన కర్కటేనైవ సంలిఖేత్ ॥ ౬ ॥ కేంద్రీకృత ప్రాగపర బిందోర్వలయ యోగతః । మత్స్యాకృతిర్భవేదేత ద్వృత్తమండల మధ్యగా ॥ ౭ ॥ తస్మాత్స్య పుచ్ఛముఖయో ర్మధ్యతో వృత్తమండలం । ప్రాచ్యామేకాం లిఖేద్రేఖాం సమయామ్యోత్తరానిత్వాం ॥౮॥ వృత్తసంయోగయామ్యోద గ్రేఖాగ్రబిందుచిహ్నితే । తే కేంద్రీకృత్య వలయ ద్వితీయం విలిఖేత్సుధీః॥ ౯ ॥ వలయద్వితయస్యాస్య సంయోగాన్మత్స్యసంభవః । మత్స్యమధ్యే విలిఖితా రేఖా పూర్వాపరాభిధాః ॥ ౧౦ ॥ ఏవం దిక్సాధనం కృత్వా పూర్వోక్త విషువద్వయోః । దినార్ధసమయే శంకుం దిఙ్మధ్యే తు వినిక్షిపేత్ ॥ ౧౧ ॥ యామ్యోత్తరాయాం రేఖాయాం శంకోరుత్తరయామ్యతః ।. యస్మిన్ దేశేయా

పరిదృష్టాచ్ఛాయాత్రాక్షభాభవేత్ ॥ ౧౨ ॥ కుండినీ పట్టణేమేష తులాయనదిన ద్వయోః । త్రీణ్యంగుళాని షట్త్రింశ ద్వ్యంగుళా ౩-౩౬ న్యక్షభాభవేత్ ॥౧౩॥ దేవరాజ్ఞ - ౨-౪౮ - శ్చన్నపుర్యా మక్షభానిశ్చితాబుధైః । శ్రీకాళహస్తినగరే త్ర్యంగుళాషడ్వ్యయం గుళా - ౩ - ౬ ॥

—♦ అనంతర మక్షకర్ణానయనమాహ ♦—

శ్లో॥ శంకోశ్చాక్షప్రభాయాశ్చ ఉభయోర్వర్గసంయుతాత్ । మూలంభవేదక్షకర్ణ ఇత్యేవం నిశ్చితోబుధైః ॥౧౫॥ అథవాక్షప్రభా వర్గః పంచవింశతి ౨౫ భాజితః । అర్క ౧౨ సంఖ్యాయుతోవాయ మక్షకర్ణోంగుళాత్మకః ॥౧౬॥

—∗ శంకుపరిమాణానయనమ్ ∗—

శ్లో॥ ఛాయావర్గం కర్ణవర్గా త్త్యక్త్వా శేషస్యయత్పదం ।
తదేవదిఙ్మధ్యశంకోః పరిమాణమనారతం ॥౧౭॥

—∗ విషువచ్ఛాయానయనమ్ ∗—

శ్లో॥ కర్ణవర్గాచ్ఛంకువర్గం హిత్వాతదవశేషతః । మూలం గ్రాహ్యం తదేవాక్ష చ్ఛాయాభవతి సంతతం ॥ ౧౮ కుండిన్యామక్ష కర్ణస్తు సూర్యేంద్వగ్నికరాబ్ధిభిః । ౧౨-౩౧-౪౨ । అంగుళైర్నిశ్చిత శ్చన్నపట్టణేర్క-ధృతి ౧౨-౧౮ ర్భవేత్ ॥౧౯॥

—∗ అథేష్టచ్ఛాయయాసూర్యోదయాది ఘటికాపరిజ్ఞానార్థ మాదౌ భాజ్యానయనమాహ ∗—

శ్లో॥ దశ ౧౦ ఘ్నాక్షభయా ప్తస్య చరస్యైవ కృతిస్సదా । ద్వి ౨ నిఘ్నా స్వశరాం ౫ శాఢ్యా స్యాద్భాజ్యో వేద రుద్ర ౧౧౪ యుక్ ॥

—∗ అథ మధ్యాహ్నహారానయనమాహ ∗—

శ్లో॥ శర ౫ భక్తాచ్చరాల్లబ్ధ ముదగ్గోళేంద్రభూ ౧౧౪ యుతం ।
మధ్యహారోభవేద్యామ్య గోళేతు వియుతంయది ॥



—∗ అథ అభిమతహారానయనమ్ ∗—

శ్లో॥ ఇష్టచ్ఛాయాకృతియుతా చ్ఛంకువర్గాచ్చ యత్పదం ।
స్యాదిష్టకర్ణస్తద్భక్తా ద్భాజ్యా దభిమతోహరః ॥

—♦ అథ నతసాధన క్రమమాహ ♦—

శ్లో॥ అక్షకర్ణహతాభీష్ట హారోమధ్యాద్వి శోధితః । భవేత్స మాఖ్యస్తద్ద్విగుణం వేదాంకాబ్జా ౧౯౪ ధికంయది ॥౨౩॥ తదా పృథక్ నివేశ్యాబ్ధి గోభూ ౧౯౪ హీనం గుణో ౩ ద్ధృతం । ఫలంసం యోజ్యతన్మూల మర్ధనాడీవియుగ్నతం ॥౨౪॥ స్యాద్వేదాంకధరా ౧౯౪ ల్పస్య సమాఖ్యద్విగుణాస్యతు । మూలమేవనతం హ్యే తదర్ధ నాడీ విశోధితం ॥౨౫॥

—♦ ఇష్టచ్ఛాయాసాధిత నతాదిష్ట ఘుడికాశ్చాహ ♦—

శ్లో॥ నతేనైవోనితంచాహ ర్దళంపూర్వాపరార్ధయోః ।
అభీష్టచ్ఛాయయాజాతం ఘటికాద్యమితీరితమ్ ॥ ౨౬॥

—♦ నతోన్నతనాడికా స్వరూపమాహ ♦—

శ్లో॥ సూర్యో దయాది ఘటికాః ప్రాక్క-పాలేస్యు రున్నతాః । పశ్చాత్క-పాలే సూర్యాస్త ఘటికాశ్చో న్నతాస్సదా ॥౨౭॥ తాభి రున్నతనాడీభి రూనాహర్దళనాడికాః । నతనాడ్యో భవంత్యేతాః ప్రాక్పశ్చిమ కపాలయోః ॥౨౮॥

—♦ అక్షాంశసాధనమాహ ♦—

శ్లో॥ అక్షప్రభా పంచ ౫ హతా దశాం ౧౦ శోనాక్షభాకృతేః ।
అక్షాంశాస్సంభవంత్యేతే సదాదక్షిణదిగ్భవాః ॥౨౯॥

—♦ అథ క్రాంతిసాధనమాహ ♦—

శ్లో॥ ఖాబ్ధయః ౪౦ శూన్యనాగాశ్చ ౮౦ శైలరుద్రాః ౧౧౭ కుపంచభూః ౧౫౧ । రూపనాగేందవ ౧౮౧ స్తర్క వ్యోమాక్షీణి

౨౦౬ తతఃపరం ॥౩౦॥ వేదబాహుకరా ౨౨౪ శ్శాస్త్ర వైశ్వానర భుజా ౨౩౬ స్తతః। వ్యోమాబ్ధిబాహవః ౨౪౦ క్రాంతి పదకాస్స్యు రిమేధ్రువాః ॥౩౧॥

| | | | |
|---|---|---|---|
| ౧-ప-౪౦-ఆ-౪౦ | ౪-ప-౧౫౧-ఆ-౩౦ | ౭-ప-౨౨౪-ఆ-౧౨ | ౦-ప-౦-అ-౪౦ |
| ౨-ప-౮౦-ఆ-౩౭ | ౫-ప-౧౮౧-ఆ-౨౫ | ౮-ప-౨౩౬-ఆ-౪ | |
| ౩-ప-౧౧౭-ఆ-౩౪ | ౬-ప-౨౦౬-ఆ-౧౮ | ౯-ప-౨౪౦-ఆ-౦ | |

శ్లో॥ యస్యకస్యగ్రహస్యాపి కర్తవ్యేక్రాంతిసాధనే। సోగ్రహోయనభాగాది యుతః కేంద్రత్వమాప్నుయాత్ ॥౩౨॥ సాయనాంశగ్రహస్యాస్య భుజభాగాదశో ౧౦ ధృతాః। లబ్ధం పదకసంఖ్యాస్యా దంతరేణావ శేషితమ్ ॥౩౩॥ హత్వాదశ ౧౦ హృతం లబ్ధం పదకేనయుతంతతః। దశ ౧౦ హృత్క్రాంతిరంశాది స్సాయనగ్రహాదిగ్భవేత్ ॥౩౪॥

—♦ అథ నతాంశ సాధనమాహ ♦—

శ్లో॥ క్రాంత్యక్షభాగయోరేక దిక్స్థితత్వే సమన్వితాత్।
దిగ్భేదేతువిహీనేన నతాంశాస్సంభవంతిహి ॥౩౫॥

—♦ అత్రాయం విశేషః ♦—

శ్లో॥ క్రాంత్యక్షయోరేకదిక్చేత్ నతాంశాదక్షిణాస్తదా।
భిన్నదిశ్యుభయోర్మధ్యే యోధిక స్తద్దిగంశకాః ॥

—♦ లంకోదయ లగ్నప్రమాణ నిర్ణయః ♦—

శ్లో॥ లంకోదయా విఘటికాః మేషస్య గజ తారకాః।
వృషభస్యాంకగోఽక్షిణి యుగ్మస్యత్రిద్వివహ్నయః ॥

టీ॥ విఘటికాః = విఘటికారూపములగు, లంకోదయాః = లంకాలగ్న ప్రమాణములు, మేషస్య = మేషమునకు, గజ తారకాః = (గజ-౮, తారకాః-౨౭) ౨౭౮ యున్ను, వృషభస్య= వృషభమునకు, అంగగోఽక్షిణి = [అంగ-౯, గో-౯, అక్షిణి-౨] ౨౯౯ యున్ను, యుగ్మస్య = మిథునమునకు, త్రిద్వివహ్నయః = [త్రి-3, ద్వి-౨, వహ్నయః - 3] 3౨3 న్ను,



శ్లో॥ ఏతాః కర్కటకాదీనాం వ్యుత్క్రమేణ భవంతిహి।
తులాదీనాం క్రమాదేతాః మృగాదీనాం విలోమతః ॥

టీ॥ ఏతాః = పైనచెప్పిన మేష వృషభ మిథున ప్రమాణవిఘడియలు, వ్యుత్క్రమేణ = తలక్రిందుగా, కర్కటకాదీనాం = కర్కటక సింహ కన్యా రాసులకును, ఏతాః = ఇవి, తులాదీనాం = తులా వృశ్చిక ధనూ రాసులకు, క్రమాత్ = క్రమముగాను, మృగాదీనాం = మకర కుంభ మీనరాసులకు, విలోమతః = తలక్రిందుగాను, భవంతి = అగుచున్నవి.

తా॥ లంకాలగ్న ప్రమాణములు విఘటికారూపముగా యీక్రింద వ్రాయఁబడును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మీనమేషములకు | ... | ౨౭౮ | కర్కటకధనుస్సులకు | ... | 3౨3 |
| వృషభకుంభములకు | ... | ౨౯౯ | సింహవృశ్చికములకు | ... | ౨౯౯ |
| మిథునమకరములకు | ... | 3౨3 | కన్యాతులలకు | ... | ౨౭౮ |

—♦ స్వదేశలగ్న ప్రమాణ సాధనమ్ ♦—

శ్లో॥ స్వదేశ చర ఖండోనా మేషాద్యా రాశయ స్త్రయః।
వ్యస్తైస్తైశ్చరఖండై స్తే కర్కటాద్యాస్త్రయో యుతాః ॥

టీ॥ అందు, మేషాద్యాః = మేషాదిరాసులు, త్రయః = మూడైన, రాశయః = రాసులు, స్వదేశచరఖండోనాః = స్వదేశ - ఆయాదేశములయొక్క, చరఖండ - ఆదిమధ్యాంత్య చరఖండములచేత క్రమంబుగ, ఊనాః - తగ్గుచు, స్వదేశీయరాసులగును. వ్యస్తైః - తలక్రిందు లగు, తైః - ఆ, చరఖండైః - చరఖండములచేత, యుతాః - కూడిన, తే - ఆ లంకాలగ్నములగు, కర్కటాద్యాః - కటకసింహకన్యలు, త్రయః - మూడును, స్వదేశరాసులగును.

శ్లో॥ క్రమతశ్చరఖండైస్తైస్తే తులాద్యాస్త్రయోయుతాః।
వ్యుత్క్రమైశ్చరఖండైస్తే త్రయోహీనా మృగాదయః ॥

టీ॥ తే - ఆలంకాలగ్నములగు, తులాద్యాః-తులాదులగు, త్రయః - మూడును క్రమతః - క్రమంబుగ, తైశ్చరఖండైః - ఆచరఖండములచేత, యుతాః - కూడినవగుచును, మృగాదయః - మకరాదులగు, త్రయః - మూడైన, తే — అవి, వ్యుత్క్రమైః-

తలక్రిందులగు, చరఖండైః - చరఖండములచేత, హీనాః - తగ్గినవగుచును, స్వదేశ లగ్నములగును.

శ్లో॥ వినాడికాత్మకాశ్చైతే భవేయుస్స్వస్వదేశజాః ।
స్వదేశచరఖండోన యుక్తలంకోదయైఃక్రమాత్ ॥

టీ॥ క్రమాత్ - పూర్వోక్త క్రమంబున, స్వదేశ చరఖండోన యుక్త లంకోదయైః- ఆయా స్వదేశ చరఖండములతో న్యూనాధిక్యములగు లంకాలగ్న ప్రమాణములచేత, స్వస్వదేశజాః - ఆయా స్వదేశీయములగు, ఏతేః - ఈ మేషాది ద్వాదశ రాసులును, వినాడికాత్మకాః - విఘటికారూపముగలవి, భవేయుః - కాగలవు.

తా॥ లంకా లగ్నములగు మేషమందు అదిచరఖండమును, వృషభమందు మధ్యచరఖండమును, మిథునమందు అంత్యచరఖండమును తీవచవలెను. మఱియు లంకాలగ్నములగు కర్కటకమందు అంత్యచరఖండమును, సింహమందు మధ్యచర ఖండమును, కన్యయందు ఆదిచరఖండమును కూడవలెను. మఱియు లంకాలగ్నములగు తులాది రాశిత్రయమందు క్రమంబున చరఖండములం గలపవలెను. మఱియు లంకాలగ్నములగు మకరాదిరాశిత్రయమందు చరఖండములను వ్యుత్క్రమముగ తీవచవలెను. ఇట్లు చేయఁబడిన లంకాలగ్న ప్రమాణములే ఆయా స్వదేశలగ్న ప్రమాణంబులు విఘటిరూపములం గలవగుననుట.

అకారాది సకలదేశములకు విషువచ్ఛాయాంగుళ వియంగుళములును, ఆయా దేశముల చరఖండములును, ఆయా దేశముయొక్క మేషాది ద్వాదశలగ్న ప్రమాణ ఘడియా విఘడియలును గల చక్రము ముందు చూడఁదగును.

## —♦ ఇష్టకాల లగ్నానయన క్రమము ♦—

శ్లో॥ తత్కాలసాయనార్కస్య భోగ్యాంశాస్స్వోదయఘ్నతాః ।
త్రింశద్భక్తాభవేత్భోగ్య కాలస్త్వేవం గతాంశకైః ॥

టీ॥ తత్కాల సాయనార్కస్య = తాత్కాలిక సాయనరవియొక్క, భోగ్యాంశాః = భోగ్యాంశములు, (అనఁగా తత్కాల సాయనరవియొక్క, భాగలిప్తా విలిప్తలను 30 భాగలలో తీవచగా మిగిలిన భాగ లిప్తావిలిప్త లనుట) స్వోదయ



ఘ్నతాః = స్వ-తనయొక్క, (అనఁగా సాయనరవి స్థితరాశియొక్కయనుట) ఉదయ= రాశిప్రమాణవిలిప్తలచేత, ఘ్నతాః = గుణింపబడినవై, త్రింశద్భక్తాః = 30 చే భాగింపబడగా నేర్పడిన లబ్ధ విఘటికలు, భోగ్యకాలః = భుజింపదగిన కాలము, భవేత్ = అగును. ఏవం = ఈప్రకారము, గతాంశకైః = సాయనరవి భుక్తాంశలచేతను,

శ్లో॥ గతకాలోభవేద్భోగ్య శ్శోధ్యోభీష్టవినాడిషు ।
యావద్రాశిప్రమాణాని తావచ్ఛోధ్యానియత్నతః ॥

టీ॥ గతకాలః - గతవిఘడియలు, భవేత్ - అగును. భోగ్యః - భుజింపఁదగిన విఘటికారూపము, అభీష్టవినాడిషు - ఇష్టకాలవిఘడియలయందు, శోధ్యః - తీవచదగినది. మిగిలిన విఘడియలలో, యావద్రాశి ప్రమాణాని - క్రమముగ తదనంతరములగు యెన్ని రాశిప్రమాణములు, శోధ్యాని - తీవచదగినవో, తావత్ - అన్ని రాశిప్రమాణములు, యత్నతః - ప్రయత్నమువల్ల, (శోధ్యాని) తీవచదగినవగును.

శ్లో॥ తతోవశిష్టంఖత్రిఘ్న మహీనోదయభాజితం ।
ఫలంభాగాదికంతత్ర రాశిస్థానేత్వజాదికైః ।
అహీనపూర్వైస్సహితే లగ్నంసాయనముచ్యతే ॥

టీ॥ తతః - తదనంతరము, అవశిష్టం - మిగిలిన విఘటికారూపము, ఖత్రిఘ్నం- (ఖ-0, త్రి-3) 30 చేత, ఘ్నం - గుణింపబడినదియై, అహీనోదయభాజితం-అహీన- తీవచబడిన, ఉదయ - రాశిప్రమాణ విఘటికలచేత, భాజితం - భాగింపబడగా నేర్పడిన, ఫలం - లబ్ధమగు, భాగాదికం - భాగ లిప్తావిలిప్తలను, అహీనపూర్వైః - తీవచబడని లగ్నముకంటె పూర్వములగు, అజాదికైః - మేషాదులచేత, సహితే - కూడిన, తత్ర - ఆరాశిస్థానే, సాయనార్క రాశిస్థానమందు, (సహితే) చేర్చగా, సాయనం- అయనముతోగూడిన, లగ్నం - లగ్నమని, ఉచ్యతే - చెప్పఁబడును.

శ్లో॥ అయనాంశైర్విహీనం తల్లగ్నం తాత్కాలికంభవేత్ ॥

టీ॥ అయనాంశైః - అయనాంశములచేత, విహీనం - తగ్గిన, తత్-ఆ, లగ్నం- లగ్నము, తాత్కాలికం - తాత్కాలిక లగ్నమగును.

తా॥ తాత్కాలికసూర్యుని అయనాంశములతో కూడగా, (తాత్కాలిక సాయనార్కుఁ డనఁబడును.) ఇతనుండు రాశియందు గతించిన భాగాదులు భుక్తము లనఁ

బడును. మఱియు, ఆభాగాదులను 30 భాగలలో తీవచగా మిగిలినవి (భోగ్య భాగాదు లనఁబడును) ఈ భోగ్యభాగాదులను సాయనరవి వున్న రాశియొక్క స్వదేశీయ ప్రమాణ విఘడియలచేత గుణించి, 30 చే భాగింపగా లబ్ధవిఘడియలు (భోగ్య కాల మనఁబడును) ఇట్లు భుక్తభాగాదులవల్ల గతకాలము నెఱుంగవలెను. సూర్యోదయాది యిష్టకాలములో పూర్వోక్తభోగ్య విఘడియలను తీసివేసి, సాయనరవియొక్క క్రిందభాగాదులను విడచి, సాయనరవి రాశిస్థానమందు (౧) ఒకటి కలపవలెను. శేషించిన యిష్టకాలములో సాయనరవిస్థిత తదనంతర స్వదేశరాశి ప్రమాణములు యెన్ని పోగలవో, అన్ని రాశిప్రమాణములను క్రమముగా తీసివేసి, అన్నిసంఖ్యలను సాయనరవి రాశిస్థానమందు కలపవలెను. అట్లు చేయగా (శేషించిన యిష్టకాల విఘటికలను 30 చె గుణించి) తదనంతర రాశిప్రమాణముచేత (అనఁగా తీవచబడని స్వరాశిప్రమాణ విఘడియలచే ననుట) భాగించగా లబ్ధము భాగలగును. ఆశేషమును ౬౦ చె గుణించి, మఱల భాగించగా లబ్ధము లిప్తలగును. ఇట్లు విలిప్తలనున్నా దెచ్చుకొనవలెను. ఈలబ్ధమగు భాగ లిప్తావిలిప్తలను పూర్వోక్త సాయనరవి రాశిస్థానమందు కలిపిన (మేషాదిరాశి) సంఖ్యక్రింద చేర్చుకొనఁగా సాయనలగ్నమగును. ఈ సాయనలగ్నములో అయనాంశములు తీవచగా తాత్కాలికలగ్న మగుననుట.

శ్లో॥ భోగ్యాదల్పేష్టకాలేతు తదిష్టంఖాగ్నిసంగుణం ।
స్వోదయాప్తఫలోపేత స్సూర్యయేవ తనుర్భవేత్ ॥

టీ॥ భోగ్యాత్ - భోగ్యాకాలముకంటె, ఇష్టకాలే - ఇష్టకాలము, అల్పే సతి - తక్కువగుచుండ, తదిష్టం - ఆ యిష్టకాలము, ఖాగ్నిసంగుణం - (ఖ - ౦, అగ్ని - 3) 30 చేత, సంగుణం - గుణింపబడినదై, స్వోదయాప్తఫలోపేతః - స్వోదయ - సాయనసూర్యోదయ లగ్న ప్రమాణముచేత, ఆప్త - భాగింపబడగా నేర్పడిన భాగాది లబ్ధముతో, ఉపేతః - కూడిన, సూర్యఏవ - సూర్యుఁడే, తనుః - లగ్న భావము, భవేత్ - అగును.

తా॥ భోగ్య విఘడియలకంటె జననాది యిష్టకాలము తక్కువైనయెడల అప్పుడు ఆయిష్టకాలమును 30 చె గుణించి, సాయనరవిస్థిత లగ్నప్రమాణముచే భాగించగా వచ్చిన లబ్ధమగు భాగాదికమును తాత్కాలికసాయన సూర్యునియందు కల



పగా ఆసూర్యుఁడే సాయనలగ్నంబగును. అందు అయనాంశములు తీవచగా తాత్కాలిక లగ్నంబగుననుట.

## —♦ రాత్రికాల లగ్నసాధనక్రమము ♦—

శ్లో॥ సషడ్భసాయనార్కస్య భుక్తభోగ్యాంశకైరపి ।
నిశాయామిష్టకాలస్య లగ్నంసాధ్య మితీరితమ్ ॥

టీ॥ సషడ్భసాయనార్కస్య - ఆఱురాసులతో కూడిన తాత్కాలిక సాయన రవియొక్క, భుక్తభోగ్యాంశకైరపి - భుక్తభోగ్యాంశములచేత, ఇష్టకాలస్య - ఇష్ట కాలమునకు, నిశాయాం - రాత్రియందు, లగ్నం - లగ్నము, సాధ్యం - సాధింపదగిన దని, ఈరితం - చెప్పఁబడెను.

తా॥ రాత్రికాలమందు జననాది యిష్టకాలమైనయెడల తాత్కాలిక సాయన రవియందు (౬) ఆఱురాసులను కలిపి సూర్యోదయాది యిష్టకాలములో అహః ప్రమాణమును తీసివేసి మిగిలినకాలమువల్ల పూర్వోక్తప్రకారము లగ్నము సాధింప దగినదనుట.

## —♦ లగ్నమువల్ల యిష్టకాలమును సాధించుక్రమము ♦—

శ్లో॥ సాయనాంశస్యలగ్నస్య భుక్తకాల వినాడికాః ।
అయనాంశాన్వితార్కస్య భోగ్యకాల వినాడికాః ॥

టీ॥ సాయనాంశస్య - అయనాంశములతోగూడిన, లగ్నస్య-లగ్నముయొక్క, భుక్తకాల వినాడికాః - భుక్తకాలవిఘడియలును, అయనాంశాన్వితార్కస్య - అయనాంశములతో గూడిన సూర్యునియొక్క, భోగ్యకాల వినాడికాః - భోగ్యకాల విఘడియలును,

శ్లో॥ లగ్నార్కయోర్మధ్యగత స్వోదయానాం వినాడికాః ।
ఏకీకృత్యఖశాస్త్రాప్తా దిష్టనాడీ వినాడికాః ॥

టీ॥ లగ్నార్కయోః - లగ్నసూర్యులయొక్క, మధ్యగత స్వోదయానాం - మధ్యయందుండు రాశిప్రమాణములయొక్క, వినాడికాః - విఘడియలనున్నూ, ఏకీ

